# HRIDAYA PADYAM

*(Collection of Metrical Verses in Telugu)*

by

**Dr. J. Bapu Reddy**

Second Edition : **2003**



*Price :* **Rs. 100/-**
**US** $10

*Copies available at :*
**Visalandhra Publishers**
4-1-435, Bank Street, Vignan Bhavan
Hyderabad and Branches

*Published by :*
**Jubilee Publications**
Plot 10, Road 5
Jubilee Hills
Hyderabad - 500 033 A.P. - INDIA

*Designed & Printed at :*
**Vipla Computer Services**
*(Designer & Multi Colour Offset Printers)*
Nallakunta, Hyderabad - 500 044.
Ph. : 2767 6910

# కృతి తొలిప్రతి సమర్పణం



**శ్రీమతి లీలారెడ్డి - శ్రీ కొరుపోలు లక్ష్మారెడ్డి**

అన్యోన్య పుణ్యదంపతులకు

స్నేహోపాయనంగా 'హృదయపద్యం' కృతి తొలిప్రతి సమర్పితం.

తెలంగాణా గడ్డమీద రైతుబిడ్డలుగా పుట్టిన ఈ తేజోమూర్తులు
తమ ప్రతిభాపాటవాలతో, సుగుణ సంపదలతో, శక్తి సామార్థ్యాలతో,
దేశభక్తి, దైవభక్తి ప్రపత్తులతో, సమాజసేవ చేస్తున్న కర్మయోగులు.
అంతర్జాతీయ లయన్స్ క్లబ్ వ్యవస్థకు చెందిన
హైదరాబాదు (తూర్పు) క్లబ్‌లో ప్రముఖ సభ్యులుగా,
పేరొందిన 'అశోకా బిల్డర్స్' గృహ నిర్మాణ సంస్థ భాగస్వామ్యులుగా
వీరు అందిస్తున్న ధార్మిక, సాంస్కృతిక సేవలకు
ప్రశంసాపూర్వకంగా పట్టిన అక్షరాంజలి ఇది.

**- జె. బాపురెడ్డి**

# పద్యకవితావసంతుడు : బాపురెడ్డి

- శేషేంద్ర

మిత్రుడు శ్రీ బాపురెడ్డి తెలుగులో వరిష్ఠకవి; వర్తమానాంధ్రకవుల్లో అతిరథ మహారథుల శ్రేణికి చెందినవాడు. ప్రసిద్ధ ఆధునిక కవులందరూ ఎలా పవిత్ర పద్యగర్భంలో నుంచి ఉదయించారో, అలాగే బాపురెడ్డి కూడా. ఆయన పద్యకళలో సిద్ధహస్తుడు. ప్రస్తుతం నేను ఆస్వాదించి ఆనందించిన ఆయన కవితాసంగ్రహం "హృదయ పద్యం" నామాటకు సాక్షం చెపుతుంది.

"మామిడి పూచినట్లు మధుమాసము హాసము చేసినట్లుగా
నా మదియే నవప్రణవ నాదసిక మ్మయి మ్రోగినట్లు తే
జోమయ కాలచక్ర పరిచుంబిత దిక్తటమట్లు కోరి నే
నే మరుజన్మమెత్తినటు లీ యువవర్షము దర్శన మ్మిడెన్"

(యువవర్షదర్శనం)

"తెల్లని వేపపూవొగరు తీరిన మామిడికాయ బెల్లమున్
చల్లని నీటి కల్పిన రసమ్మును దొన్నెల నిండ త్రాగి మ
త్తిల్లిన నామనంబు అరుదెంచిన కొత్త ఉగాదులందు రా
గిల్లెను, వాడిపోని వనగీతిక యై స్వరసప్తశైలమై"

(యువ దర్శనం.)

బాపురెడ్డి ఆధునిక యుగీనకవి అయినప్పటికీ దేశకాల తత్త్వజ్ఞత, సదసద్వివేకము, కావ్యకళావేతృత సమీచీనంగా ఉన్న విలక్షణ కవి. మాతృగర్భమైన గతకాలాన్ని కొందరు అవివేకులు గర్హించినట్లు బాపురెడ్డి గర్హించడు. మనముందు ముళ్ళలో రాళ్ళలో నడిచి తమ రక్తసిక్త పాదాలతో. మనం సుఖంగా నడవడానికి, దారి చేసిన మన పూర్వజులైన మార్గకర్తలకు ఆయన నమస్కరిస్తాడు.

"పద్యపు కాలుచేతులను పాశవికమ్ముగ త్రుంచి నట్టి ద్వే
షోద్యమకర్తలందరు మహోజ్జ్వల ఛందము విందు సేయు స
ద్విద్యను తూలనాడి వెలసిన దుర్మతులంద రిప్డు, నీ
పద్య సరస్వతీ చరణ పద్మములం గని మోకరిల్లరే" (సాహితీవిశ్వనాథుడు)

అని కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారిని ప్రస్తుతించాడు. సత్యనిష్ఠుడు. ద్రష్టృత్వమూర్తి ఆయన మహాకవి జాషువాను గూర్చి శ్రీ బాపురెడ్డి ఇలా వర్ణించాడు. "ప్రవిమల గుణసాగరుడవు, నవకవితా పద్య పద్మ నాభుడవు ప్రజా, కవి శబ్ద రసాకృతుడవు, శివసుందర సత్యభావ శిల్పివి నీవే" - (జాషువా పీడిత జనవాసవా.) - దిగంత వ్యాప్త యశశ్చంద్రి కల్లో సుస్నాతులైన శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులను తన పద్య రత్నాలతో అర్చించాడు. అలాగే భావకవిత్వ యుగకర్త శ్రీరాయప్రోలు సుబ్బారావుగారి తర్వాత ఆ యుగకవుల్లో ద్వితీయ స్థానం అలంకరించిన శ్రీ దువ్వూరి రామిరెడ్డిగార్ని గురించి "నెల్లూరు మండలమ్మున, పల్లియ చిరునవ్వులోన ప్రభవించియు సంపుల్లాత్మకచేతనత వర్ధిల్లిన దువ్వూరి రామరెడ్డికవీంద్రా" "అన్నా నీకవితాకళాహృదయ భావావేశమున్... ఎన్నో భాషలు నేర్చినావు నవ సాహిత్య ప్రపంచమ్ములో కన్నీటిన్ భరియించి నీ తెలుగు మాగాణాల విజ్ఞాన సంపన్నంబైన అపూర్వకావ్యనిధులన్ పండించి నావో కవీ!" పూర్వజులు పథికృతు లైన మహానుభావులను స్మరించే ఈ అమూల్య సంస్కారాన్ని మనకు ప్రసాదించిన ఋక్కు ఏమంటుందో చూడండి, "ఇదం నమ ఋషిభ్యః పూర్వజేభ్యః పూర్వేభః పథికృద్భ్యః" - ఈ ఋగ్వాహినీ జలాల్లో స్నానమాడి పునీతుడైన కవి శ్రీ బాపురెడ్డి.

కవికి అమూల్య మూలపదార్థమైన అనుభూతిని, శ్రీ బాపురెడ్డి దేశవిదేశాల్లో విస్తృతంగా పర్యటించి, అపారంగా ఆర్జించాడు. కవి ఎన్నిదేశాలు తిరిగితే ఎందరు ఉత్కృష్ట మానవులతో సంపర్కం సంపాదిస్తే, ఆయన వాక్కు అంత గంభీరమైన సముద్రంలా రూపొందుతుంది. కనకనే, "యస్తు పర్యటతే దేశాన్ యస్తు సేవేత పండితాన్, తస్య విస్తారితాబుద్ధి: తైలబిందురివాంభసి", అని ప్రాచీను లన్నారు. శ్రీ బాపురెడ్డి థాయిలెండ్ వెళ్ళినప్పుడు అక్కడి నూతన వాయు లహరులు శరీరాన్ని కోమలంగా స్పృశిస్తూ ఉండగా వికసిత హృదయారవిందుడై ఇలా చెప్పాడు,

> "పిలిచెను థాయిలెండు నను ప్రేముడి, వేల వసంత గంధముల్
> చిలికెను నా విముగ్ధ నవచేతముపై అనుభూతి గీతికా
> కలిత తరంగ "ఛావొప్రియ" కావ్య విపంచిక మీటి పాడె, నే
> వలచిన స్వప్నలోకములు వాసితమైన ధరిత్రి జూచితిన్"

"కటి కౌపీనము దాల్చి జీవన లసద్గంగా తరంగాలపై
నటన మ్మాడితి సర్వశాస్త్రవరవీణా వైణిక స్వామినై
స్ఫుటశృంగార విలాస రాగరచనా పూర్ణాభిరాముండనై
'పటయాబీచి' కవోష్ణకౌముదుల గోపాలుండనై పోయితిన్" -

*(ధాయిలెండు కలల బెండు)*

"హృదయపద్యం" అనే ఈ కృతి మణిమాణిక్యాలాంటి పద్యాలతో జాజ్వల్యమానమైన ఒక పెద్దగని. బాపురెడ్డి సాహిత్య భాషలో నుంచి పరిమళభరితమైన శబ్దాన్ని ఏరుకోవడంలో గొప్ప ప్రవీణుడు. ఆశబ్దాలు "మృదూని కుసుమాదిపి" వాటిని పద్యపాదాలుగా అల్లిశ్రోతను సమ్మోహితుడ్ని చేయటంలో అద్వితీయ ఇంద్రజాలికుడు. ఆయన సమానం మేఘంమీద ఛళ్ళున విరిసే విద్యుల్లతలా ఉంటుంది. బాపురెడ్డి త సుమారు నలభైఏళ్ళ కావ్య యాత్రలో అనేక వచన కవితా సంకలనాలు ప్రచురించాడు. కీర్తి ఆర్జించాడు. బహుళః బాపురెడ్డిని పద్యకవిగా చాలామంది ఎరగరు. కానీ ఆయన పద్యంలో గాండీవి, వచనంలో వసంతకోకిల.

శ్రీ బాపురెడ్డి తెలుగు సాహిత్యంలో వరణీయ కవుల్లో గణనీయుడు స్మరణీయుడు అని నిరాఘాటంగా చెప్పవచ్చును. శుభం భూయాత్.

*జ్ఞాన్ బాగ్*
హైదరాబాదు

*డాక్టర్ గుంటూరు శేషేంద్రశర్మ*

# బాపురెడ్డి - భావవాదం - భౌతికవాదం

బాపురెడ్డి అంతర్జాతీయకవి. ఈ మాట అలవోకగా అన్నదికాదు. అతడు 36 దేశాల్లో పర్యటించాడు. అంతకంటే ఎక్కువ సంస్కృతులతో పరిచయమేర్పరచుకొన్నాడు. ఆయా భాషా సాహితీకారులతో స్నేహం చేశాడు. వారి కవితలలో కొన్నింటిని తెలుగులోకి తెచ్చాడు. తన కవితలు కొన్నింటిని ప్రపంచ బాషల్లోకి అనువదింపబడే స్థాయికి ఎదిగాడు. తన పుస్తకాలు కొన్నింటిని విదేశాల్లో ఆవిష్కరించాడు. కొందరు విదేశీయులకు అంకితమిచ్చాడు. ఇంగ్లీషులో కవిత్వం ప్రకటించాడు.

ఇల్లు వదలిపెట్టి బయటకు తొంగిచూడని తెలుగు కవిత్వానికి ఇలాతలతత్వం నేర్పిన కవి బాపురెడ్డి, అందకని ఆయన తెలుగు కవే కాదు, భారతీయకవేకాదు, అంతర్జాతీయ కవి.

బాపురెడ్డి విలక్షణమైన కవి. ఆయన ఎంత విపులంగా అంతర్జాతీయ పర్యటనలు చేశారో, అంతవిస్తారంగానూ కలం సాగించాడు. ప్రధానకవిత్వరూపాలైన పద్యం, గేయం, వచనకవిత - మూడింటిలోనూ విశేషకృషి చేశాడు.

పద్యకవులకు, వచన కవిత వంటపట్టదు. వచన కవులకు పద్యం వాసన గిట్టదు. ఈ రెండు కవితలకు వాహికగాసాగిన మాత్రాఛందోబద్ధమైన గేయం కాలపరీక్షలో అనాదరానికి గురి అయింది. ఈ నేపథ్యంలో బాపురెడ్డిని సమన్వయకవిగా సంభావించవచ్చు. ఆయన ఏకవితా రూపాన్నీ నిరాదరించలేదు. పట్టిన ప్రతి కవితారూపంలోనూ, పచ్చి పసుపులు పండించారు. అచ్చపు వెన్నెలలు కాయించారు.

పద్యరచనలో ప్రతిభగల లేఖిని రెడ్డిగారిది అనడానికి ఒక మచ్చుతునక

"మామిడి పూచినట్లు మధు
మాసము హాసము చేసినట్లుగా
నామదియే నవ ప్రణవ
నాదపికమ్మయి మ్రోగినట్లు, తే

జోమయ కాలచక్ర పరి
చుంబిత దిక్తటమట్లు, కోరినే
నే మరుజన్మమెత్తినటు
లీ యువవర్షము దర్శనమ్మిడెన్''

చక్కని ధారతో చిక్కని శైలితో పంటకాలువ లాగా ప్రవహించగల సంయమనంతో ఆయన పద్యాలు సాహితీ లోకాన్ని అలరించాయి. 'పద్యానికి ప్రమాదంలేదు - పద్యం పాతబడలేదు' అనే భరోసాను పద్యప్రియులకు కలిగించాయి.

మాత్రాఛందంలో మహత్తరమైన వీణలు మ్రోగించిన మన కవితా వైణికుల్లో బాపురెడ్డిగారిది చెరగని స్థానం.

తెలుగులో సినారె మాత్రాచంధో సుందరిని కొత్త గంధాల అందాలతో అలంకరించాడు. కాళోజీ మాత్రా ఛందస్సులతో సత్యపద యాత్రల్ని తీవ్రపథాల్లో గానం చేశారు. మల్లారెడ్డి పిడుక్కూ బియ్యానికి మాత్రలనే మందుగా వాడాడు. దేవీ ప్రియ ఆ ఛందానికి ఫ్లేవర్ తెచ్చాడు. ఈనుని దయానంద కావ్యాలనే కదలించాడు. బాపురెడ్డి గేయాలదారుల్లో పుప్పొడిని గుప్పెళ్ళతో వెదజల్లాడు.

ఆయన గేయకవితలు రాశారు. కావ్యాలు పాడారు. గేయనాటికలు ఆడారు. శరత్కాలాన్ని భూమాతకట్టుకొన్న వెన్నెలచీర అంటూ ఆయన ఆమధ్య దూరదర్శన్‌లో ప్రసారంలో చేసిన 'ఋతురాగం'లోని పాట పలువురు సాహితీ ప్రియలను ఆశ్చర్యంతో అబ్బురంతో కనుబొమ్మలెత్తి మెచ్చుకొనేట్లు చేసింది.

నీవొక విచిత్ర బాలవు
నీవొక విప్లవ జ్వాలవు

అంటూ మాత్రా బద్ధమైన నినాదాలతో పఠితగుండెల్లోకి జొరబడగల బాపురెడ్డిని గూర్చి భీమన్న

బాపురెడ్డి ప్రణయం
ప్రణవ నినాదం
బాపురెడ్డి ప్రణవం
ప్రణయ వినోదం - అంటాడు

ఇవి తమాషాకు చెప్పిన మాటలు కావు. బాపురెడ్డి ప్రణయంలో ప్రణవం ప్రణవంలో ప్రణయం వుంటాయంటే- ఆయన భావనలో ఫిలాసఫీ, పిలాసఫీలో బావుకత ఉంటాయని అర్థం. ఫిలాసాఫికల్ టచ్ లేని కవిత్వం ఈనాడు పరిణతి చెందిన బాపురెడ్డి కవిత్వం నుండి ఊహించలేం.

వచనకవిత్వం చెప్పడంలో బాపురెడ్డి గారిదొక ప్రత్యేకమైన ముద్ర. అలాగే కవిత్వం చదవడంలో కూడా ఆయనదొక ప్రత్యేకవైఖరి.

గుండెల్లోంచి కవిత్వం సృజన చేసినట్లే - గుండెల్లోంచి కవిత్వం పఠనం సలిపే బాపురెడ్డి ఏకవిసమ్మేళనంలో పాల్గొన్నా - అక్కడ అతడేడ హైలైట్.

బాపురెడ్డికి ప్రాచీన ఛందాల మీద ఉన్న అధికారం ఆయన వచన గేయాల మీద ప్రభావం చూపుతుంది. మోడరన్, పోస్టు మోడరన్ అభివ్యక్తీకరణల మీద బాపురెడ్డికి ఆసక్తిలేదు. ఆయన పద్యాన్నీ గేయంలా రాయగలడు. వచన కవితనూ గేయంగా రాయగలడు. అది బాపురెడ్డి కవితావైభవానికి విజయమైనా, అపజయమైనా అనివార్యమైన దారి వారిది.

*ప్రేమను మించిన ధర్మంలేదు*
*సమతలను మించిన సత్యంలేదు*
*సామరస్యాన్ని మించిన సౌందర్యంలేదు –*

ఇక కవితా విషయ బాహుళ్యం వైపు వస్తే - అవనీ ఆకాశాల మధ్య ఆత్మ అంతరాత్మల మధ్య ప్రణయం మధ్య, ప్రణవంమధ్య, ప్రళయంమధ్య - తుపాను మధ్య, తుషారం మధ్య వెన్నెలమధ్య, విరహం మధ్య, అనురాగం మధ్య, దేశభక్తిమధ్య, దేశప్రగతిమధ్య లుప్తమైపోతున్న విలువల మధ్య, మానవతమధ్య – రవికానని చోటుల్లో కూడా ఈ కవి కలం, గవేషణ సల్పింది. అర్తులను ఆరవోసింది. అందాలను కుప్పవోసింది

ఈ కవిది సంప్రదాయబంధంవున్న ఆధునిక తత్వం. ఆధునికతాగంధం ఉన్న సంప్రదాయ సత్వం.

ఇవాళ తెలుగు కవుల్లో ఈ కవి చేసినంత పర్యటన ఏకవీచేయలేదు. ఈ కవి రాసినంతవైవిధ్యభరితమైన కవనం ఏకవీరాయలేదు. ఈ కవిపాల్గొన్నన్ని సభల్లో ఏకవీ పాల్గొనలేదు. ఇది ఈ కవి విరాడ్రూపం.

ఒక్కోసారి ఫక్తు భావకవిగా బావుటాలెత్తే ఈ కవి - మరోసారి ప్రగతిశీల అభ్యుదయకవిగా ఆకాశపు అంచులు చూస్తాడు. మరోసారి విప్లవ విహాయసంలో నిలబడి వీణలు వాయిస్తాడు.

బాపురెడ్డి తాను భావభౌతిక వాదినని చెప్పుకున్నారు. నిబద్ధ దృక్పథం రాజకీయ పరంగాకాక - జీవన విధానం మీద ఉండాలని చాటి చెప్పాడు. సమాజంలో జరుగుతున్న ప్రతి సంఘటనకీ స్పందించాడు. సాంప్రదాయ మీగడలను పతితల నాలుకలకు అందించాడు.

భావ భౌతిక వాదమంటే ఏమిటో బాపురెడ్డి మాటల్లోనే చూద్దాం !

*ఆత్మ జ్ఞానానికి*
*ఆవలిగట్టు దేవుడు*
*పదార్థ జ్ఞానానికి*
*ఆఖరిమెట్టు అనంతత్వం*
*అంతర్ముఖంగా యోగమారం*
*అన్వేషిస్తున్నది దైవత్వాన్ని*
*బహిర్ముఖంగా ప్రయోగమార్గం*
*శోధిస్తున్నది అనంతతత్వాన్ని*
*రెండు మార్గాల సంగమం*
*నామనోమండలం*

ఇలా భావవాద భౌతికవాద సమ్మేళనంలో ఆనంద బ్రహ్మను దర్శించాలనేది భావ భౌతికవాదం.

బాపురెడ్డి ప్రతిపాదించిన ఈ సిద్ధాంతాన్ని ప్రొ॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారు విపులంగా చర్చించారు. ఆమోదయోగ్యమైన బాపురెడ్డిగారి యీ సిద్ధాంతం కవిత్వ వికాసంలో కొత్తవాకిళ్ళు తెరుస్తుంది.

వర్తమానంలో జీవిస్తూ, వర్తమానాన్నే కాకుండా గతాన్ని ఆగతాన్ని సంభావిస్తున్న గొప్ప విజన్‌గల కవి బాపురెడ్డి. బహుముఖంగా విస్తరించిన ఆయన ప్రతిభ యువకవులకు ఆదర్శం కావాలి.

*("తెలుగువిద్యార్థి" సౌజన్యంతో)*

- *డా॥ నాగభైరవ కోటేశ్వరరావు (ఒంగోలు)*

# పద్యానికి ప్రమాదం లేదు

"పద్యానికి ప్రమాదం లేదు" అని నేనేనాడో అన్నమాట మళ్లీ ఈనాడు అంటున్నాను.

"పద్యం అనగానే పాతచింతకాయ పచ్చడి అని ఈసడించేవారు 'గద్యకవితోద్యమ' మానస పుత్రులు. పద్యం పాదాలు విరగగొట్టటమే, గేయం గుండెను గాయపరచడమే, వచనకవితా వైశిష్ట్య మని ప్రకటించుకున్నారు కొందరు కవులు. పద్యాన్ని పరిహరించటమే పరిహసించటమే అభ్యుదయశీల మని అపోహపడ్డ అమాయకు లెందరో! అయినా పద్యానికి వేయేళ్ళచరిత్ర ఉంది. భిన్న భిన్న భావాలను, చిత్ర చిత్ర శిల్పాలను, అనేకానేక ఛందాలను సంతరించుకున్న సజీవవేణి పద్యవాణి. పండిత పామరుల నాలుకలపై, పల్లెల పట్టణాల వేదికలపై అకాండలాస్యం చేస్తూనే ఉన్న అసమానశక్తి శైలూష పద్యం.

అందుకే గేయాన్ని శ్రవణపేయంగా, వచనకవితను నిసర్గలయాత్మకంగా పలికించిన నేను పద్యాన్ని కూడా హృద్యంగా పలికించాలనే ప్రయత్నిస్తూ వచ్చాను. ప్రణయ, ప్రగతి, ప్రణవోన్ముఖంగా సాగిపోయే నా భావధారలు- త్రయీనాదాలు. నాపద్య గేయ గద్య కవితల్లో నిష్పక్షపాతంగా నినదిస్తూనే ఉన్నాయి. భావశక్తికి, రసాభివ్యక్తికి అడ్డు వచ్చేది ప్రతిభాపాండిత్యాలరాహిత్యమే కాని పద్య గేయాది ప్రక్రియలు కాదు. సృజనాత్మకత, కళాత్మకత అభ్యుదయశీలత కవితకు గీటురాయి అవుతుంది కాని ఛందో రూపము కాదు. పైగా, పద్యం తెలుగువారికి సంక్రమించిన ప్రత్యేకమైన వారసత్వం. నిజానికి పద్యఛందస్సులో కొంత ప్రవేశం ఉన్నవారే గేయాన్ని, వచన కవితను శక్తిమంతంగా వ్యక్తీకరించగలరని నా విశ్వాసం. శ్రీశ్రీ, భీమన్న, దాశరథి, శేషేంద్రశర్మ, కరుణశ్రీ, నారాయణరెడ్డి వంటి అధునికులైన తెలుగు మహాకవులందరూ పద్యరచనా ప్రవీణులైనవారే. నన్నయనుండి నావరకు వన్నెలు దిద్దుకుంటున్న పద్యానికి ప్రమాదం లేదని ప్రకటిస్తున్నాను."

ఈ "హృదయపద్యం" తొలిముద్రణ ఆస్ట్రేలియాలోని "తెలుగు పలుకు' దశాబ్ది ఉత్సవాల వేదిక మీద ఆవిష్కరించి, అక్కడి తెలుగు వారికి స్నేహోపాయనంగా అంకితం చేయడం జరిగింది. నన్ను ప్రేమతో ఆహ్వానించి,

నాకు ఆ అవకాశం కల్పించినందుకు ప్రవాసాంధ్రసోదరీసోదరులకు ముఖ్యంగా "తెలుగు పలుకు" పత్రికా సంపాదకులు శ్రీ టి. నారాయణరెడ్డి గారికి ఈ సందర్భంగా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

ఈ కావ్యసంపుటిని నిసర్గ నిశిత దృష్టితో పరిశీలించి పీఠిక వ్రాసిన విశ్వవిఖ్యాత దార్శనికుడు, సృజనాత్మక కవితా మార్గదర్శి, సత్యనిష్ఠగల విమర్శకాగ్రేసరులు మహాకవి డా॥ గుంటూరు శేషేంద్రశర్మగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు. పద్యవిద్యా మర్మజ్ఞులైన శర్మగారు సహృదయతతో చేసిన నా పద్య చేతన అనుశీలన నాకెంతో ఆనందం సంతృప్తి కలిగించింది. ఆయన వ్రాసిన విలువైన మాటలు నా సాహిత్య పురోగతికి రాచబాటలు కాగలవని విశ్వసిస్తున్నాను.

నన్నెప్పుడూ ప్రోత్సహిస్తూ స్నేహశీలతో నా అభ్యుదయాన్ని కోరే ఆత్మీయులు పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ అధ్యక్షులు, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారికి, నా ఆత్మదఘ్నమైన కృతజ్ఞతలు. పుంభావ సరస్వతిగా కీర్తింపబడుతున్న కవి, రచయిత, తెలుగు సాహిత్య విమర్శన రథ సారథి ఆయన.

ఒంగోలు సీమలో పుట్టి, ఒక మహాకవిగా, వక్తగా, పరిశోధకుడగా మిన్నంట ఎదిగి తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తున్న డా. నాగభైరవి కోటేశ్వరరావు గారు నా నిత్య శ్రేయోభిలాషులు. సంస్కృత మహాభారతాన్ని అనువదించిన తెలుగు కవిత్రయంలో ఒకడై కీలక పాత్ర వహించిన ఎఱ్ఱన పుట్టిన గడ్డమీదనే పుట్టారు ఆయన. నా సాహిత్య యాత్ర గురించి 'తెలుగు విద్యార్థి'లో ఆయన వ్రాసిన స్ఫూర్తిదాయక వ్యాసం ఇందులో చేర్చినందుకు, ప్రచురణ కర్తలకు నా కృతజ్ఞతలు. డా. కోటేశ్వరరావు గారికి శతకోటి నమస్కృతులు తప్ప నేనేవిధంగానూ కృతజ్ఞతలు చెప్పుకోలేను.

**ఈ కృతి తొలి ప్రతిని స్వీకరించడానికి అంగీకరించిన ఆప్తమిత్రులు, విద్యా విజ్ఞాన సంపన్నులు, సంఘసేవాతత్పరులు Lioness శ్రీమతి లీలారెడ్డి - Lion శ్రీ కొరుపోలు లక్ష్మారెడ్డి ఆదర్శ దంపతులకు నా కృతజ్ఞతాంజలి.** తమ కుటుంబ బాధ్యతలను ఏ మాత్రం విస్మరించకుండా సమాజసేవ

చేస్తున్న ఈ కర్మయోగులు ప్రశంసనీయులు. వారితో ఏర్పడ్డ ఈ సాహితీ బాంధవ్యానికి నేను, నా కుటుంబసభ్యులందరూ ఆనంద పులకితులమైనాము. ఈ శుభసందర్భంలో నా సాహిత్యయాత్రకు దోహదం చేస్తున్న మిత్రుల్ని, శ్రేయోభిలాషులందరికి ధన్యవాదాలు అర్పిస్తున్నాము. ఆత్మీయులు శ్రీమతి పి. సూర్య - శ్రీ పి.సుదర్శన్‌రెడ్డి దంపతులకు మా అభివాదాలు. శ్రీమతి జయశ్రీ - శ్రీ పి. మహేందర్ రెడ్డి దంపతులకు, శ్రీమతి పి. కీర్తి - శ్రీ పి. రజిత్‌రెడ్డి యువదంపతులకు కూడా మా ప్రశంసాపూర్వక శుభాకాంక్షలు తెలియజేస్తున్నాము. వీరందరికి భగవంతుడు ఆయురారోగ్య ఐశ్వర్యాలు ప్రసాదించుగాక అని ప్రార్థిస్తున్నాము.

నా కవితారాధనకు నిరంతరం దోహదం చేస్తున్న నా ప్రియసతి రాజేశ్వరికి, కుటుంబ సభ్యులందరికీ నా శుభాకాంక్షలు.

పుస్తకాన్ని ముచ్చటగా ముస్తాబు చేసిన విప్ల కంప్యూటర్ సర్వీసెస్ వారికి, ముఖ్యంగా శ్రీ విజయసేనారెడ్డి గారికి, నా ప్రశంసాపూర్వక దన్యవాదాలు.

- బాపురెడ్డి

# బాపురెడ్డి గారి మరికొన్ని రచనలు

బాపురెడ్డి గేయ నాటికలు

శ్రీకార శిఖరం *(గేయ సంపుటి)*

నా దేశం నవ్వుతూంది *(గేయ సంపుటి)*

ప్రేమారామం *(గేయ సంపుటి)*

మనసులోని మాట *(వ్యాస సంపుటి)*

ప్రణవ ప్రణయం *(వచన కవిత)*

మన చేతుల్లోనే ఉంది *(వచన కవితలు)*

రంగు రంగుల చీకట్లు *(వచన కవిత)*

వాడిపోని వసంతాలు

కాలం మాయాజాలం *(వచన కవిత)*

బాపురెడ్డి భావగీతాలు *(గేయ సంపుటి)*

సౌదామినీ కవితలు

ఆత్మీయరాగాలు

జీవనశ్రుతులు *(పద్య కవిత)*

ఆటపాటలు *(గేయ సంపుటి)*

అక్షరానుభూతులు *(వచన కవిత)*

పద్యాల పల్లకి

నవగీత నాట్యం

***ఆంగ్ల కవితలు***

In Quest of Harmony

Longing for Life

Urn of Love

Loving is Living

Anatomy of Time

Verities and Visions

# విషయసూచిక

# యువవర్ష దర్శనం

మామిడి పూచినట్లు, మధు
　　మాసము హాసము చేసినట్లుగా
నామదియే నవప్రణవ
　　నాద పికమ్మయి మ్రోగినట్లు, తే
జోమయ కాలచక్రపరి
　　చుంబిత దిక్తటమట్లు, కోరి నే
నే మరుజన్మమెత్తినటు
　　లీ యువవర్షము దర్శన మ్మిడెన్!

రామలక్ష్మీ కృష్ణ రసయోగ సిద్ధిలో
　　కన్నువిప్పిన జీవకణము నేను
సిరికొండ శిఖరాల శివతాండవమ్ములో
　　పల్లవించిన పల్లె ప్రకృతి నేను
కొండవాగుల గుడి గుడి గుంజెమాటలో
　　పులకరించిన రామ చిలుక నేను
ఇల ఉగాదులనెల్ల అలరించు చైత్రుని
　　జైత్రయాత్రా చిత్ర చరిత నేను
కాలతటమున కూర్చుండి కలల అలల
తేలిపోయెడి పసిగాలి బాలకుడను
ఆది తుది లేని సృష్టికావ్యార్థములను
చెప్పుకొనుచుందు, ఎరుగను తప్పొ ఒప్పొ!

తెల్లని వేపపూ వొగరు
　　తీరిన మామిడికాయ, బెల్లమున్
చల్లని నీట కల్పిన ర
　　సమ్మును దొన్నెల నిండ త్రాగి మ
త్తిల్లిన వామనంబు అరు
　　దెంచిన క్రొత్త ఉగాదులందు రా
గిల్లెను, వాడిపోని వన
　　గీతికయై స్వరసప్తశైలమై!

కోహము కోహ మంచు యువ
　　కోకిల వేసెడి చిక్కుప్రశ్న, నా
దేహము గేహమందు నిన
　　దించును సోహము సోహ మంచు, మో
హోహము వీడి ఆత్మకల
　　హంసము తీర్చెడి సృష్టిమూల సం
దేహమువోలె, ద్యోవనధి
　　తీరము తట్టిన శబ్దవీచినాన్!

వాసంతోదయవేళ ఎన్ని కవితా
　　వారాశు లుప్పొంగెనో!
ఆశావాద జనాంతరంగములు సౌ
　　ఖ్య ప్రాప్తికానందమై
దేశంబంతట లాస్యమాడివవి, దే
　　దీప్యమ్ముగా, నిండిపో
యెన్ సౌజన్య సమత్వశోభ, విడిపో
　　యెన్ శైశిరస్వార్థముల్.

యువనామవత్సరము, నను
భువిపై పడవేసి వెడలిపోయె వెటకా! మా
నవజీవిత విపణిని నా
వ్యవహారము చూచి పోవ వచ్చెను మగుడన్.

ఏనాకమ్ముకు తీసిపోనటులుగా
ఈ లోకమున్ తీర్చు కా
వ్యానేకమ్ములు కూర్చి సంతత చిద
ద్వైతాత్ముడౌ నన్ను, చై
త్రానందమ్మున చూచి మెచ్చి యువనా
మాబ్దమ్ము దీవించె; వ
త్సా! నీ సత్కృతులెల్ల లోకముల స
త్సంయోగమున్ కూర్చెడిన్!

నన్ను యువనామ శక్తియే కన్నకతన
చిరయువత్వము నా భావచేతనమున
వెలుగుచున్నది అమృతత్వ మలరి, ముదిమి
త్రాసమే లేదు నా కవితా సవితకు.

నవ వర్షాగమన మహో
త్సవ మిది, నరులెల్ల కల్పతరులై విరులై
యువతాక్షర శివగిరు లై
నవరసనిర్ఝరులు, సిరులు నా వర్ధిలుతన్!

# రసికోదయం

అది పరదేశ; మందు భర
తావని సంస్కృతిలోని జ్ఞాన సం
పదయుతు లౌచు, అధ్యతన
భాషలు విద్యలు నేర్చి, శాస్త్రసం
విదిత వధూవరుల్ నిగమ
వేదిత దంపతులై స్వధర్మకో
విదు లయి వచ్చి పశ్చిమ వ
వీన సమాజములో వసింపగా!

అల్లారు ముద్దుగా, పసి
పిల్లలవలె మెలుగుచుండి ప్రియసఖ్యముతో
ఎల్లరికి ఆప్తులై, వ
ర్థిల్లిరి సుషమాత్మరూపురేఖల తోడన్.

ఉన్నత విద్యలు ఉద్యోగ ధర్మాలు
వదలని పుణ్యదంపతులు వారు
ఒకరి నొక్కరు "ఓయి ఓయంచు" పిలుచుచు
పరిహాసమాడుతుంటరులు వారు
వాదె అందమ్మంటె వాదె అందమ్మని
వగలు చూపెడి జానపదులు వారు
కొట్టుకైనా ఈతకొలనుకైనా సరే
జతకూడి పోవు స్నేహితులువారు

ఇండియాకైన, మిత్రుల ఇంటికైన
ఒంటిగా పోని వలపులజంట వారు
కలలు కన్నను వాస్తవికతలు గన్న
కలిసియే కను అద్వైతకములు వారు!

ఎవరిపేరేదియైన ఆ నవమిథునము
రాధికా కృష్ణుల ట్లహోరాత్రులందు
ఇన్ను మిన్నులు మెచ్చ ప్రేమించు కొనుచు
గడిపినారు మూడేళ్లొక్క క్షణమువోలె!

భారతదేశములో గల
వారల తలిదండ్రుల శుభవాంఛ ఫలించెన్
దారకు, తన సద్గుణ పతి
కోరిన రీతిగనె గర్భకోశము పండెన్.

నిదురించెడి కాయములో
నిదురించని ఆత్మ గోస్తనీవవరసవా
రదమున తేలుతు వచ్చిన
ఉదయ మ్మటు శిశు వొకండు ఉదయించెనహో!

పుట్టిపుట్టగనే పేరు పెట్టమనెను
దేశ శాసన పరిపాలనా శుభాంగి
పెట్టకయె పెట్టె నా రొక పేరు తలచి
"రసికు" డని - వీడు సద్గుణ రాశియంచు.

అమ్మమ, నాన్నను,
మ్మమ్మమ, నానమ్మను ప్రియమగు తాతల, చి
త్రమ్ముగ చూచుచు కడు చో
ద్యమ్ముగ తనపేరు ఇష్టమైనటు పవ్వెన్!

అతని పోలికలను అంచనావేతురు
అమ్మలక్క లతని ఆవరించి
ముక్కు మొగము చూచి ముచ్చట పడిపోయి
ముద్దులిచ్చుటకని మురియు తల్లి-

తల్లికళ్లని, చెక్కిళ్లు తండ్రి వనుచు
ముక్కు తాతది, నానమ్మ మోవి యనుచు
కాదు అమ్మమదే ముఖకాంతి యనుచు
మామ పోలిక ఈ చందమామ యనుచు
వాదులాడెదె రా పసివాని గనుచు!

జోలలు పాడవిదే ఆ
బాలుడు నిదురించడాయె; పాలిచ్చుటలో
ఆలస్యమైన, ఏ మా
టాలించడు బ్రహ్మదేవు డత డైనట్లే!

తొట్టిలో ఆడుకొనెడి ఆ పట్టిచుట్టు
తిరుగుచును కేకలిడుచు సంతృప్తి పడుచు
బంధు మిత్రుల పిల్ల లాబాబు, పసిడి
బొమ్మయనుకొని ఎత్తుకోబోదు రతని!

ఇన్నాళ్లు నీ వెక్క డున్నావురా! తండ్రి!
అని తన్మయత చిట్టి నడుగు భర్త
తండ్రి ఎవ్వరొ నీకు తనయుడు ఎవ్వరో
కాంచలే వని వెక్కిరించు భార్య
"పట్టి ఏడ్చును పాలు పట్టవోయీ" అని
ఆలిని పిలుచు రాగాల మొగుడు
ఓయి ఎవ్వరొ నీకు ఓసి ఎవ్వరొ, తెల్వ
దోయంచు త్రిప్పు కందోయి భార్య

మాయమాట లెరుంగని మౌనభాషి
నడ్డుపెట్టక సరసాలు ఆడుకొనెడి
ఆలుమగలను గమనించు ఆత్మబంధు
లందరికి వారి సరదాలు విందుసేయు.

నాపోలికయే యని సతి
నా పోలిక యని పతి అనునయమున వారల్
ఏ పోలిక ఎవ్వరిదో
ఆపాప డెరింగినట్టు, అడుగుచునుండన్.

దివ్యతేజోమయ సువర్ణదేహు డితడు
బాలు డైనను ఆజానుబాహు డితడు
"నాకు తోచిన యది చెప్పనా" యటంచు
తత్వముల జాడ లెరుగు తాతయ్య చెప్పె!

అనుపమరూపవంత సుగు
　　ణాఢ్యుని సృష్టి యొనర్ప నెంచి, జీ
వన రచనా కళామయుడు
　　బ్రహ్మ, అపూర్వ రసానుభూతిలో
కవి వినవట్లుగా అతుల
　　కల్పన చేసి, త్వదీయ ప్రేమ వా
హిని విడివట్టి జీవకణ
　　మే రసికాత్ముడు, మీకు పుత్రుడున్.

భావ మెరిగిన ఆ సతీపతుల నోట
మాట రాలేదు; పులకిత మానసములు
కురిసె ఆనంద బాష్పాలు విరుల వోలె
ఒడలి కదలాడు బుడుతని ఎడదమీద!

శ్రీరమ, శ్రీవర, శైలజ, దీపిక,
　　శ్రీలత, హేమలతా, లలితల్
శ్రీరణధీర, సుధీర, అశోక, హరీష,
　　ప్రభాకర, శంకరులున్
శ్రీ రఘురామ, సుకీర్తి, సుదీప్తి, అలేఖ్య,
　　నితీనులు, రోహితులున్
మారుతులై జరిపించిరి ఆ అణి
　　మా రసికోదయ ఉత్సవమున్!

రాజేశ్వరీ, భాగ్య, రాణి, గీతా, ఇందు
ఆదిలక్ష్మి, తులసి, అనిత, కావ్య
హరికృష్ణ, వెంకటేశ్వర, బబ్బి, భాస్కరుల్
రామచంద్ర, నరేంద్ర, లక్ష్మణులును
శర్మిష్ఠి, మాధురి, చంద్రకళ, అపర్ణ
లీల, ప్రార్థన, భాను, పూల, మమత
నారాయణుడు, దయానందుడు, శ్రీరంగ
రెడ్డి వెంకట్రామరెడ్డి వరులు

కీథు కూపరు, పుత్రీ సమేతము గను
సూజనా, పాల్, విదేశ వాసులు, సుమతులు
బాపురే! శాంత కేశవుల్ బంధుహితులు
వచ్చి, దీవించినారు ఆ పసిరసికుని.

# పద్యప్రశస్తి

నన్నయ, తిక్కన్నయు, పో
తన్నయు శ్రీనాథ పెద్దనాది కవీంద్రుల్
ఎన్నగ వేమన్నలు, పా
మన్నలు కని పెంచినట్టి పద్యము భళిరా!

ప్రణయ కళాత్మ తత్వములు
పద్యలతాంతములందు వెల్గు, చి
ద్రుణవ రసాత్మసత్యములు
పద్యములందు పరీమళించు, స
జ్జనగణ సర్వ సౌఖ్యకర
శాంతి సమత్వ సమాజ చేతనా
వన ఘనశక్తి సంపదల
పద్యము కందని భావ మున్నదా!

క్లిష్టప్రాసలు శ్లేషలున్ ధ్వనిలయ
క్రీడల్ రసాలంకృతుల్
దృష్టాదృష్ట సమస్తవస్తు గతదే
దీప్యోహలున్ సత్యముల్
ఇష్టాగోష్ఠులు సల్పు పద్యకవితా
హేవాక హర్మ్యాలలో
దుష్టారిష్ట వితండవాద గణముల్
దూరెన్ దురావేశతన్!

పద్య మనగానె అది ఏదో పాతచింత
కాయ పచ్చడి యన్నట్లు కనులు మోడ్చి
పెదవి విరిచెడి సరిక్రొత్త చదువరులను
గేలిచేయను నే చూచి జాలిపడుదు.

ఛందోబద్ధత గల కవి
ఛాందసు డని ఈసడించి, చదువకయే ఏ
అందము చందము పద్యము
లందున లేదనుట వెర్రియౌటయె కాదా!

వేదవేదాంగాల విజ్ఞాన సంపద
పద్యాత్మతృప్త నైవేద్యమయ్యె
క్రమధర్మవిదిత పురాణేతిహాసాలు
పద్య విద్యాసన పద్మమయ్యె
జీర్ణ "గబ్బిలము" కష్టించు "కృషీవలుల్"
పద్యాని కాద్యత్వ పాఠమయ్యె
సమ సమాజ ప్రజాస్వామ్య సంక్షేమాలు
పద్య వాణికి కమపాపలయ్యె
ప్రకృతి సౌందర్యశృంగార వైభవముల
చంద్రవిజయము విజ్ఞాన శాస్త్ర దృష్టి
నవరసనవానుభూతి మానవచరిత్ర
ప్రతిఫలించెడి పద్యము పాతబడునె!

గణయతిప్రాస ఛందస్సు గతులతోడ
రాగతాళానుగుణమైన రక్తి తోడ
హావభావాభినయ శీలియై తెనుంగు
ప్రజల వాల్కాలపై ఆడు పద్య మెపుడు!

విస్తుల జవసత్వాలు గ
భస్త్రికనీనికలు సృజనభావద్యుతులే
ఆస్తులు గల పద్యావతి
దుస్తు లపహరించలేరు దుశ్శాసనులున్.

"ఇందు గల దందు లేదను"
కందములో; జండపైన కపిరాజగు శ్రీ
సుందర శార్దూలములో
పొందెడి అనుభూతి పద్యపుణ్యము కాదా!

"నిరుపహతిస్థలంబు రమ
ణీ ప్రియదూతిక" గూర్చి ఎన్నడో
పరసము కన్న పెద్దన వ
చస్సుల హేళన చేయుచుండు కా
పురుషుల కేమిలే, సుగుణ
పూరిత మైన త్రికర్ణశుద్ధితో
నిరుపమ పద్యకావ్యములు
నేడును కూర్చవలెన్ మహాకవుల్!

రౌతునుబట్టియే హయము
        రైతును బట్టి పొలమ్ము కావునన్
చేతల మంచి చెడ్డలవి
        చేసిన వారల బట్టి యుండు, ని
ష్ణాతులు కాని వారియెడ శస్త్రము
        శాస్త్రము చేతు లెత్తుగా
చేతన లేకయే రచన
        చేసిన, పాపము పద్యవిద్యదా!

ప్రాచీనమ్మనియో అ
ర్వాచీనమ్మనియొ అనుట అప్రస్తుత మౌ
ఔచిత్య సత్య భరిత స
మీచీనమ్మైన పద్యమే సత్కృతియౌ!

గేయమ్ముల్ రచియించివన్ సరళసం
        గీతానుసారమ్ముగా,
ఏ యడ్డంకు లేని సద్వచన మం
        దే కైతలన్ కూర్చివన్
ఆయా భావరసానుకూల వరశ
        య్యా శబ్దశైలీయుత
శ్రేయశ్ఛంద పునీత పద్యరచనా
        శిల్పుల్ గదా సత్కవుల్!

# సాహితీ విశ్వనాథుడు

నన్నయనుండి నావరకు,
నమ్మినదానిని నమ్మినట్లు, దే
శోన్నతికోసమై నవర
సోజ్జ్వల కావ్యము లల్లినట్టి భా
వోన్నతులందు సన్నుతుడ
వోయి ! సహస్ర ఫణాగ్రకాంతి సం
ఛన్నుడవోయి! నీ కృతులు
సత్యసరిత్తులు విశ్వరాట్కవీ!

చెలియలికట్టపై కడిమి
చెట్టును కిన్నరసాని పాటతో
వెలయగ జేసినావు; అది
వేదసుబోధ వసంతశోభతో
తెలుగున కల్పవృక్షమయి,
దివ్యత రామకథామృతమ్ము ని
స్తులముగ పంచిపెట్టు పరి
శుద్ధుల కామనలెల్ల తీర్చుచున్.

వాద వివాద వివాదాంధ్ర సాహిత్య
వనములో వల్మీక వాణి నీవు
వాటి వ్యాకరణ ఛందస్సూత్ర రణభూమి
ధర్మగీతా ప్రబోధనము నీవు

ప్రాచీన దృష్టి కర్వాచీన దృష్టికి
        శిష్టసమీచీన సృష్టి వీవు
నిందయు స్తుతియు వెన్వెంట నీ కీర్తిని
        మోసెడి అద్వైతమూర్తి వీవు

దేశకాలాలకును వేషభాషలకును
అంతుపట్టని పరమాత్మకాంతి వీవు
గురువులకె గురుడౌ శిష్యవరుడ వీవు
శిష్యు లెవ్వరు సరిరాని చిద్గురుడవు!

పద్యపు కాలుచేతులను
        పాశవికమ్ముగ త్రుంచినట్టి, ద్వే
షోద్యమ కర్తలందరు, మ
        హోజ్జ్వల ఛందము వింద సేయు, ప
ద్విద్యను తూలనాడి వెలి
        వేసిన దుర్మతులంద రిప్డు, నీ
పద్యసరస్వతీ చరణ
        పద్మములన్ కని మోకరిల్లరే!

నన్నయ్యచేతిలో వెన్న ముద్దలుతిన్న
        పద్యమ్ము నీ గుండెపై స్రవించె
తిక్కన్న ఒడిలోన తేనెపలుకులు తిన్న
        పద్యమ్ము నిన్నెంతో ప్రస్తుతించె
శ్రీనాథు నింట పాకానేకములు తిన్న

పద్యమ్ము నీ నోట పరిమళించె
పోతన్న షడ్రసోపేతాన్నములు తిన్న
పద్యమ్ము నిను చూచి పరవశించె
అష్టదిగ్గజములు ప్రసిద్ధాశుకవులు
విందుచేసిన పద్యమ్ము క్రుందినపుడు
జాషువా కృష్ణశాస్త్రి దాశరథి వంటి
సహచరులతోడ పద్యావసంతలక్ష్మి
ద్రఢిమ నిల్పిన విశ్వనాథుడవు నీవు.

ఏ ప్రక్రియ చేపట్టిన
ఆ ప్రక్రియలోన సిద్ధహస్తుడ వౌటన్
నీ ప్రాభవము ప్రభావము
ధీ ప్రజ్ఞోపజ్ఞ తెలుగుతేజం బయ్యెన్.

దేహాత్మలవలె నీ స
త్సాహిత్యము భాష - భావ సంయోజన, స
మ్మోహకమౌ! అక్షర వీ
ణా హంసక విశ్వనాథ నారాయణమై.

వేయి వాసంతములనుండి వెదకి వెదకి
తెలుగు సాహిత్య శారద తెచ్చుకొన్న
జ్ఞానపీఠ పురస్కార గౌరవమ్ము
నీవు! ఋషివి మానవతామనీషి నీవు.

నీ సాహిత్య సమావలోకనము తం
ద్రీ! చేయగా బూని, వి
ద్యా సంపన్న రసజ్ఞవిజ్ఞులు, వివే
కాత్ముల్ భారతీజ్ఞాన ల
క్ష్మీ సాన్నిధ్యము చేరినారు నవసం
ఘీబావ సందీప్తు లై
భాసిల్లన్ వలె పూర్ణసత్య సమతా
భాగ్యోదయ మ్మెల్లెడన్.

# కవి గాంచనచో...

రవియు కాననిచో కను కవి యటంచు
కవి ఎవడు శాపమిచ్చెనో కాని, ఇనుడు
కాంచలేనట్టి చీకట్లు కాంచి కాంచి
కరగుచుంటిని దుఃఖాశ్రుకణము నౌచు.

ఓ రవి! నింగిదారుల మ
హోజ్జ్వల కాంతిరథమ్ము నెక్కి నీ
వారయునట్టి దేమి? జను
షంధువు సైతము చూచు బాహ్య సం
స్కారమె కాని, దాని వెన
కం గల స్వార్థ పిశాచకృత్య భాం
డారము కాదు, కాదు చిరు
నవ్వుల దాగిన కారుచీకటుల్.

దిట్టముగా భవ న్నయన
దీధితు లెల్లెడ ప్రాకువేళలన్
గట్టుల దాగు వ్యాఘ్రములు,
కానల పుట్టల దాగు నాగు లె
ట్టెట్టులు అంధకారమున
ఎన్ని అమాయిక ప్రాణులన్ భువిన్
పొట్టనబెట్టుకన్ మురిసి
పోవునొ కానవు నీవు భాస్కరా!

భుజగములె కాదు హరులు బెబ్బులులె కాదు
ముక్కు మొగములు లేని ఆ మూషికములు
కూడ ఓ సూర్యుడా నీవు చూడలేని
రాత్రులందు విధ్వంసకరాజ్య మేలు.

కవియు కావనిచో కను రవి యటంచు
అందుకే నేను లోకకల్యాణమతివి
వర మిడుచునుంటి ఓ ప్రభాకరుడ నీకు
సార్థక మ్మౌత నీ కర్మసాక్షి బిరుదు!

# భూమిగండం

ఏదుస్స్వప్నము చూచి భీతిలి, ధరి
        త్రీమాత కంపించెనో
ఆదౌర్భాగ్యకరాళరాత్రి; తన ప్రే
        మాంకమ్ములో నిత్యమున్
సేదల్ తీరగ నిద్ర పోయెడి సుతుల్,
        చేజారి మృత్యుగ్రలీ
లా దావాగ్నివి కూలపోయిరి, జగ
        ద్రక్షాపతేమయ్యెనో!

ఉదయభానుడు ఎంత ఊపినా లేపినా
        లేవజాలని ఆ కళేబరాలు
వింగియే క్రుంగి కన్నీ రెంత కార్చినా
        ఆరిపోవని ఆ చితాగ్ని శిఖలు
గాలిగుండెలు ఎంతగా బాదుకున్నను
        చివురించ లేని ఆ జీవితాలు
మూర్ఛపోయివ కాలమును పట్టుకొని ఏడ్చు
        ఆత్మబాంధవ గడియారములను
కాంచినపుడు, నిరాశావరించి నపుడు
మాట రాలేదు మతి లేని మట్టినోట
ఎవరు చేసివ పాపమో ఎరుగలేక
ప్రకృతియే తల్లడిలె పసిపాపవోలె!

అది ముప్పది సెప్టెంబరు
తుది, పందొమ్మిది శతాల తొంబదిమూడై
నది, నాలుగు గంటలదరి
ఉదయము, మహారాష్ట్ర మృత్యు ఊయెల యయ్యెన్.

పుడమి కడుపులోన పోకిరి లావాగ్ని
రాతి పొరల దాగుమూతలాడె
సృష్టి దృష్టికి అది చెలగాటము, భరత
ఖండమునకు ప్రాణగండ మాయె!

ఊళ్లకు ఊళ్లు కూలె, విల
యోగ్రవినాశపిశాచిహేషలో
ఇళ్లకు ఇళ్లు కూలి, ఎవ
రింటనె వారు సమాధులైరయో
తల్లులు తండ్రులున్ యువక
దంపతులున్ పసిపాప లందర
ట్లెల్లరు చెల్లుకాల మొక
టేయగు ఘోరరహస్య మేమిటో!

ఖిల్లారి, ఏకొండి, కిల్లారివాడిలో
బ్రతికి బయట పడ్డ ప్రాణి లేదు
పస్తూర్, గువాల్, పేథు సాంఫ్వి, హోలీ గ్రామ
వాసులందరు స్వర్గ వాసులైరి

రాజెగాం, ఉద్దంపురా వంటి పల్లెలు
పాడుబడివ వల్లకాడు లయ్యె
కాటెచెంచోలి, మాగ్రల్, తొషిఖడ్ లాంటి
ఊళ్లెన్నొ పూర్తిగా ఊడ్చబడియె
ఆ విశాల మరట్వాడ యంత, అందు
చేరు ఉస్మానబాదు లాటూరు మండ
లాల గుండెలు గజగజలాడి పోయె
తల్లి భారతి కలలెన్నొ దుల్లి పోయె -

ఖండాంతరములు, భారత
ఖండమువకు తోడుపడె నఖండముగా, భూ
గండములో నుండి, సుహృ
ద్భాండము వెల్వడెను మానవత వర్ధినియై.

చితికిపోయిన వారి చిట్టాలు వ్రాసెడి
బ్రతికిపోయిన ప్రజాబంధులార!
కూలిపోయిన ఇళ్ల తాలూకు నష్టాలు
నిర్ధారణము చేయు నిపుణులార!
ఎవ్వరి వారను లెవ్వరో తేల్చెడి
న్యాయరక్షా దండనాథులార!
వస్త్ర భోజన వైద్య వసతులు కల్పించ
దానధర్మముచేయు దాతలార!

వేలవేలాది మృతు లిట విడిచి చనిన
ఆశలును, ఆశయాలు, స్వప్నాంకురాలు
మాసిపోనీక ఫలియింప చేసినపుడె
సార్థకము పునరావాస చర్యలన్ని.

ఎనుబదికోట్లు భారత జ
 నేందిర కంఠములో సమైక్యతా
మణిమయ హారముల్ మెరిసె;
 మానవజాతి ఒకే కుటుంబమై
ఘనతర సానుభూతి మమ
 కార పతాకము క్రింద నిల్చె; భూ
జననియు ఊరడిల్లె తన
 సంతు వహించిన ధైర్యశక్తికిన్.

# శిలాక్షరి

రాయివిగూర్చి నే కవిత
వ్రాయుదు, ఎందుల కన్న అందులో
నే యెవలేవి సత్యముల
వీడలు జాడలు దాగియున్నవే
మో యనిపించు నాకు; ప్రణ
వోద్భవ సృష్టిరహస్య బోధనా
మ్నాయము ప్రస్తరమ్మయి అ
మాయికతన్ వినదించు నామదిన్.

మనిషి, ఆతని పూర్వీక మర్కటమ్ము
పుట్టనప్పుడు ఏజీవి పుట్టనపుడు
చెట్టుచేమలు నీరైన పుట్టనపుడు
పుట్టినది గుట్టుగా కొండగట్టు రాయి.

ఇది పుట్టి వేయేండ్లు, అది పుట్టి లక్షేండ్లు
కొన్ని పుట్టి ఆయె కోట్ల ఏండ్లు
ఇది జర్గి ఇన్నాళ్లు, అది జర్గి అన్నాళ్ళు
కొన్ని జరిగి ఆయె ఎన్నొనాళ్లో
ఆరూప మిట్లయ్యె, ఈరూప మట్లయ్యె
ఏది ఏదో అయ్యె ఎప్పుడెపుడొ
ఏనాటి దేనాటి కేమేమి అయ్యెనో
ఈనాటి దొకనాటి కేమి యగునొ

చెప్పుటకు తోడుపడెడి విచిత్రమైన
కాల మను కొలబద్ద ఏ కాలమందు
పుట్టెనో చెప్పుమని నేను పట్టుబట్టి
గుప్తముగ వేడుచుంటి ఈ సుప్తశిలను.

శ్రీశైలాగ్రముమీద భూతలముపై
సింధూదరమ్మందునన్
రాశీభూత త్రికాలశక్తి పగిదిన్
రాజిల్లు పాషాణమున్
నే శిల్పమ్ముగ చెక్కి మ్రొక్కెదను; సం
దీపించు వైజ్ఞానికా
కాశమ్ముల్, పరమాత్మతత్త్వములు ఓం
కారమ్ములై మ్రోయగా!

పాషాణమ్ములు ఎరుగని
భాషలు, భావములు లేవు; పరిణామపథా
న్వేషికి అవియే పత్ చి
ద్భేషణము లభ్యుదయపు ధ్రువతారకలౌ!

శిలల పూజించు ఏకాంత సేవకుడను
ప్రస్తరాలను పలికించు భావుకుడను
జడమునకు చేతనమునకు ముడులు వేసి
నింగి నేలల కలుపు విహంగ మేను!

# సీతావియోగి

తమ్ముడు లక్ష్మణుండు తన
దారను ఊర్మిళ వీడి ఇన్నివ
ర్షమ్ములు ఎట్లు జీవన భ
రమ్ములు విల్పుకొనంగ జాలెనో!
వమ్మరుగావి ఒక్కొక క్ష
ణమ్ము శరమ్ము వ్రణమ్మువోలె సీ
తమ్మకు నాకు దూరమయి
నప్పటినుండి వధించు నేలకో!

నాకారణమునవే భా
ధా కీలల నాదు తండ్రి దశరథు డీల్గెన్
నాకారణమునవే కా
దా కంటికి నిద్రలేక తమ్ముడు కుమిలెన్!

ప్రాయములోనె లక్ష్మణుడు
ప్రాణ సఖిన్ విడవాడి కంటక
ప్రాయ వియోగ జీవితవి
భావరులెట్లు సహించె నంచు నే
నేయెడ ఎంచుకుంట, గడి
యేవి అయోనిజ వీడకుంట అ
న్యాయము, న్యాయ సమ్మతమె
నాకు వియోగపుశిక్ష వేయుటల్.

తా ననుభించదేని అర్థమ్ము కాదు
ఒరుల బాధలు బరువు లెవ్వరికి గాని
సానుభూతి లక్ష్మణు వియోగానుభూతి
కలదె? సీతాపహరణమ్ము కలవ గాక!

మేటి నరేంద్రులంతకును
మేటి సురేంద్రులు అంతకంతకున్
మేటి నిశాచరేంద్రులును
మేదిని పుత్రిని నా కళత్రమున్
గోటను తాకినన్ త్రుటిని
కూలరె కాలరె; ఆమె రక్ష కే
నాటికి చింత లేదు ఇక
నాబ్రతు కెట్లను చింత మ్రగ్గెదన్ -

నాకోదండము నా భుజాబలముక
న్నన్ జానకీ కోపిత
భ్రూ కోదండము పాతివ్రత్య బలముల్
పూర్ణమ్ము లౌ మిన్నలౌ
నా కర్మమ్మువ గాక ఆమె నెవరై
నా పట్టుకో సాధ్యమా
నా కోదండము నారియే విరహ వీ
ణా తంత్రు లై పోయె నా!

తల్లి దండ్రులను పుత్ర వియోగమున ముంచి
　　　　పాగివచ్చితిని భూజానితోడ
భరత శత్రఘ్నుల భ్రాతృబంధము త్రెంచి
　　　　చేరవచ్చితివి కాంతారములకు
ఊర్మిళకు పతివియోగ యోగము పెట్టి
　　　　కదలివచ్చితివి లక్ష్మణునితోడ
నన్ను కన్నుల కద్దుకొన్న ప్రజల వీడి
　　　　తరలి వచ్చితి రామగిరి గుహలకు
ఇందరిని నిండు ఎడబాటు ఏట ద్రోసి
వచ్చితివి నేను ఘనధర్మవర్తి ననుచు
అందరి వియోగధునులు నమ్మైక్యమై న
నీ విరహ సింధువున ముంచునేమొ ఏమొ?

మిత్ర నిజ భ్రాతృ మజ్జన
యిత్రి వియోగత్రయము సహించితి నెట్లో
చిత్రము వేడెందులకొ, క
ళత్ర వియోగమునవే శిలానిభు నైతిన్.

"బావగారికి మా ఎడబాటులోని
బాధ తెలియును మా సీతబాసి కొంత
కాలముండిన" యని ఊర్మిలా లతాంగి
హాస్యమున కన్నదెదొ నిజమైన దేమొ?

అనెడి వియోగ యోగి సజ
        లాంబుదగాత్రుని భగ్నరామ చం
ద్రుని గనినాను ఏమియును
        తోచని చీకటిరేయిలో ఘనా
ఘనరవముల్ విలాపములు
        కన్నుల మూతలు తీసివేసె నే
కనివది విన్నదేమి కల
        కాదుగదా? నిజమేను చూచితిన్.

"ఎవడు శపియించె ఊర్మిళాధవుని, జాన
కీపతిని, అలనాడు యక్ష ప్రియుని
ప్రణయజీవుల నెవ డెడబాపు" నంచు
తలచి తలచి నేకనులెప్డు మలచినానొ!

# థాయిలండు కలల చెండు

పిలిచెను థాయిలండు నను

ప్రేముడి, వేల వసంత గంధముల్

చిలికెను వావిముగ్ధవవ

చేతముపై అనుభూతిగీతికా

కలిత తరంగ "ఛావొప్రియ"

కావ్యవిపంచిక మీటి పాడె, నే

వలచిన స్వప్నలోకములు

వాసితమైన ధరిత్రి చూచితిన్.

గంగాయమునలు, హోయాంగువా, వోల్గాలు

రైలు నైలు ప్రవంతి రాణులైన

"చావొప్రాయి" తరంగిణీ విలాసము చూచి

ఈసువసూయతో గాసిలుదురు

సరసపాగరుడైన పరవశుడై పొంగు

ఆయేటి వలపుల ఆటలు గని

వెండివెన్నెల రేల గుండెలన్నియు వెచ్చ

వెచ్చగా కరగు తర్ద్వచి కలలొ

ఆ సుధాపగ మందస్మితాసవములు

గ్రోల, వత్తురు దేశదేశాలనుండి

రసికవరులు సుకవులు తాపసులె కాదు

నాకమును వీడి దేవతానీకములును.

కటి కౌపీనము దాల్చి జీవనలస
        ద్గంగా తరంగాలపై
నటన మ్మాడితి, సర్వశాస్త్ర వరవీణా
        వైణికస్వామినై
స్ఫుట శృంగార విలాసరాగరచనా
        పూర్ణాభిరాముండ నై
పటయాబీచి కవోష్ణకౌముదుల గో
        పాలుండనై పోయితిన్.

శ్రీరామ నామము చిత్తాన నినదించు
        చిలుకలే ఇంటింట పలుకు నచట
శ్రీకృష్ణరాసకేళీలీల స్ఫురియించు
        బృందావనమె వీధి వీధి యచట
కష్టాలు కడతేర్చు అష్టమార్గోన్ముఖ
        బౌద్ధమే తెరవాద బౌద్ధ మచట
జీవాత్మ పరమాత్మ భావైక్యతాకేకి
        స్వేచ్ఛగా నాట్యమ్ము చేయు నచట
భావ సంగమ భూ పరివ్యాప్త మైన
ఇహ పర సుఖ ప్రదాయక హిందు జలధి
జనిత మోహిని బ్యాంకాకు ఘనత నచట
కాంచి తరియించినాను ప్రపంచ కవిగ.

*(1988లో ప్రపంచమహాకవుల సభలో పాల్గొన్న సందర్భంలో).*

# కోటిరత్నాల వీణ

ఆగిపోలేదు రుద్రవీణా ప్రవమ్ము
ఆరిపోలేదు నవకవితాగ్ని ధార
ఎగసిపోలేదు నీవు మా ఎదల నుండి
దాశరథి! నీకు అజ్ఞాత వాసమేల!

పుట్టిన దాది, చీకటుల
పుట్టలలో బుసకొట్టు నాగులన్
పట్టి విషమ్ముపిండి, నిరు
పద్రవ జీవనరుద్రవీణ, చే
పట్టి, ధరాతలమ్మునకు
పట్టిన పీడల మట్టు పెట్టగా
పట్టిన దీక్షవీడని ప్ర
భంజన, మమ్మెటు వీడిపోతివో!

ఎన్నడు జన్మభూమిని స
హించగరాని ఆకించనమ్ము సం
పన్నము చేసి పోవునాకొ!
స్వార్థపరత్వ పిశాచకంఠ వి
చ్ఛిన్నము ఎన్నడో యనుచు
చింతిలి చింతిలి, నీ ప్రబోధముల్
పిన్నలు పెద్ద లాచరణ
పెట్టెడి మార్గము చూడబోతివో!

సర్వసౌఖ్యాల వర్ధిల్లు స్వర్గమట్లు
ఈ జగత్తును రూపించ నెంచి నీవు
అసలు స్వర్గము చూచిరా నరిగినావొ
దివ్యనిపుణులతో సంప్రదింపులేమో!

"నాతెలంగాణ కోటి రత్నాలవీణ"
అనుటయే కాదు, ఆవీణ అయ్యె నీదు
అక్షరావేశ కవితాంతరిక్ష తంత్రి
అమృత భావాంబ రైక పద్య ప్రవంతి!

సుత్తిదెబ్బలు తినుచు ఉసూరు మనెడి
రాళ్ల గుండెలపై నీవు వ్రాసినట్టి
కవితలు శిలాక్షరమ్ములే కాక అయ్యె
నిహత మానవతాత్మ కన్నీటిజాలు!

నీ, రుబాయి, గజలు నీకంటిపాపలై
నవ్వి, ఏడ్చి. వలచి, నాట్యమాడి
పంచిపెట్టె ప్రజకు పన్నీరు కన్నీరు
మర్మ ధర్మ, జ్ఞాన మార్గ మెరిగి!

ప్రేముడిని తెల్గు తల్లిని పిలిచినావు
కోరి నవభరతాంబను కొలిచినావు
దళితజనలోకమాతను తలచినావు
విస్తుల యశస్సు పీఠిపై నిలిచినావు!

కపితో నిన్ పడద్రోసివట్టి రజనీ
కారాగృహమ్మందు నీ
వపి ధరానిశితారుణాక్షర లిపిన్
ఆసేతు శీతాచలో
ర్వి సుఖానంద మరంద గీతికల ఆ
వేశించి వ్రాయన్ ప్రభా
ప్రసవమ్ముల్ విరబూచె ఘోరపరతం
త్రధ్వాంతముల్ వీడగన్!

సత్య సుందర శబ్ద శస్త్రాలు సంధించి
తిమిరాసురుల కడతేర్చినావు
త్యాగ రంజిత 'కవితా పుష్పకమ్ము' పై
వెలుగు లెల్లెడ చేరవేసినావు
ఆలోచనాలోచనాలోకనముతోడ
కళ్యాణదుర్గాలు కట్టినావు
ఒక మహాబోధివై ఒక శాంతి దూతవై
మనిషిని మనిషిగా మలచినావు
పద్యమైనను గేయము గద్యమైన
జీవకళ యయ్యె నీభావచేతనమున
వాద మేదైన నీ సిద్ధవాక్కుముందు
మోకరిల్లెను సత్యనమ్మోహనమున!

వందనవాటికల్, వితర
ణాస్థిత కల్పక కామధేనువుల్
సుందరమైన అప్సరలు
శోభలు, సర్వసమత్వ జీవితా
వందములున్, సుధల్ ప్రణవనాదము
నిత్యము వెల్గుకాక, ఈ
కుందెడి భారతావనిని
కూడను దాశరథీ! భవత్కృపన్!

# రాగ భగవతీ!

ఈ భావ వనములందున
ప్రాభాత సమీర మట్లు పాడెడి నను, రా
శీ భూత సౌరభ జ్వా
లా భామినివోలె ఎందులకు కాల్చెదవే!

రాయినిగాను నేను జన
రాల! భవద్రసవాక్కు దృక్కు గం
గా యమునావగోర్మికల
కాగితపుంపడ వట్లు తేలు, పా
పాయిని, రాగ పుష్ప మధు
పాయిని, నీ గుణరూప చైత్ర శో
భాయుత గీతికా రచన
మందు ఋషిత్వము నొందు ధన్యుడన్.

నీ కరబంధనాల నవ
నీతమువోలె ద్రవించి పోవగా
నీ కబరీభరమ్మున ని
నీలపయోధరమై లయించగా
నీ కనునీడలందు దయ
నీయ ఖగ మ్మటు నిద్రపోవగా
నీ కలలన్ తలంపులను
నే నితివృత్తము కా తపించెదన్.

గాజుల మ్రోతలో విజయ
కాహళ గర్జలు చేసినాను, నీ
రాజమరాళయానమున
రాజ్యములెల్ల జయించినాను, నీ
రాజసమూర్తిలో భువన
రంజకకీర్తి గడించినాను, రా
రాజును నేమ నన్ను రుచి
రమ్మొగ నేలెడి రాణి వీ వహో!

దైవము నాకు కృష్ణుడు స
దా, తొలి రోజుల బాలకృష్ణుడే
దైవము నాకు, నా బ్రతుకు
దారులు చూపెడి వెన్నదొంగయే
దైవము, రాధికానయన
తామరసాశ్రుమరందధారలో
జీవన వేణుగాన మగు
శ్రీపతి దైవము నీకు నా కిలన్.

నీకును నాకు ఛాందసుల
వేమమునన్ యతి చెల్లదేవి, గే
యాకృతిలోన ప్రాసయతి
నై జతనౌదు మ నీకు, మెచ్చు నీ

లోకము, భావుకాధునిక
లోక మహాభ్యుదయోన్ముఖ ప్రజా
నీకము, ప్రేమవాహినివి
నీకు రసాబ్ధిని నాకు అడ్డులా!

ఎందుకు నిన్ను గూర్చి ఎద
నింత తపింతును, తోలుబొమ్మవే
యందును, కాని అందె నుడి
కందని అందము లెన్ని యో రసా
నందము లెన్నియో వెదకు
నా సకలేంద్రియముల్ మరెవ్వ రే
మందురొ కాని, జాలిపడు
మందును నాపయినిన్ త్రపామయీ!

స్నేహ పరిమళార్ద్రమగు
చిర్నగవొక్కటి చాలు, నందు దా
సోహము, ద్రోహబుద్ధి బల
శూరులు స్వార్థకుబేరు లందమౌ
వ్యూహము లెన్ని పన్నిన ప్ర
యోజన ముండదు నన్ను గెల్వ, సం
దేహము లేదు నా క్షణిక
దేహము సత్యచిదాత్మ నీవె యౌ.

తీరము లేని రోదసిని,
ద్వీపము దీపము వంటి జాబిలిన్
దూరము భార మం చనక
దోర్బల ధీబల సాహసాఢ్యులై
చేరిన వ్యోమగాముల వి
శిష్ట విచిత్ర చరిత్ర జూచి నిన్
చేరగవచ్చు నన్న ధృతి
చే నినుగోరితి నభ్రసూనమా!

కంబుగళంబు, చక్రముఖ
కంజ కళావిభవంబు, వీణ రూ
పంబు వహించు నీ జఘన
భాండము నీ తలబంతి నీ జడల్
బింబము లౌట శ్రీహరికి
విద్యలరాణికి, నామనంబు దే
హంబును పల్విధంబుల ప్రి
యా! నిను గొల్చుట సాజమే గదా!

కందము లిరుకడలుగ, నా
డెందము సూత్రమ్ముగా వడిన్ గ్రుచ్చిన ఈ
సుందర భావోత్పల మా
లం దమితో స్వీకరించు రాగభగవతీ!

# సత్యసారథి

శ్రీకరమై సమస్త మత
        సేవితమై పరమాత్మతత్త్వబో
ధా కృతియై చిరాచిర చ
        రాచర సృష్టిరహస్యవేద్యమై
లోకవిలోకనా ప్రణవ
        లోచనమై ప్రభవించె సాయిబా
బా; కరుణా రసార్ణవ శి
        వంకర సుందర సత్యశాయి యై!

సంకువు చక్రమున్ సిలువ
        చంద్ర కళాభిధలన్ని సాయి ప్రే
మాంక సరోజ పత్ర శత
        మై విలసిల్లెను; వేషభాషలా
టంకము కావు ఆతని క
        డానికటాక్షములో తరించగా
శంకలు వంకలున్ కలి వి
        షాదములెల్లయు తీర్చుకోవగా!

ఆకలి తీర్చెడి అన్నదానము కన్న
        మిన్నదానమ్ము లేదన్నవాడు
దప్పి దీర్చెడి జలధార లందించుట
        కన్న ధర్మమ్ము లేదన్న వాడు
దళితుల పతితుల దరిజేర్చి సాకుట
        కన్న వ్రతమ్ము లేదన్నవాడు

వికలాంగులకు సర్వ విధ సహాయము చేసి
ఆదుకొనుటే పుణ్యమన్నవాడు
పలుకు పలుకున సత్యమ్ము చిలుకువాడు
చిదమలానంద క్షేత్రాల సేద్యకాడు
పుట్టపర్తిని కైలాస పురము చేసి
ఇలను పాలించు సత్యసాయీశు డతడు!

సాయిబాబా కనుసన్నలో సంపూర్ణ
విద్యాలయాలెన్నొ వెలసి విలిచె
సత్యసాయీకరస్పర్శతో శాస్త్రీయ
వైద్యాలయాలు ప్రవర్ధమయ్యె
భగవాను సాయిబాబా సన్నిధే సుప్ర
శాంతి నిలయ భక్తిసౌధ మయ్యె
స్వామి విశ్వప్రేమ సందేశమే దేశ
దేశాలలో జ్ఞాన దీపమయ్యె
అతని సంకల్ప సృష్టి భక్తాంతరాళ
కామనలు తీర్చు కల్పవృక్షమ్ము వోలె
ఆయురారోగ్య సౌభాగ్యదాయకాత్మ
శక్తియే భగవాన్ సత్య సాయి స్వామి!

దెబ్బదవ జన్మదిన మని
పబ్బము వేడుకలు చేయ బాబాకు ప్రజల్
కబ్బములు, కళలు, పూవులు
గుబ్బవ కురిసినవి అతని గుణ గానములై.

# ప్రజాస్వామ్య జాతకం

హస్తముసాచి దీనవద
నాబ్జము నించుక నేల వాల్చి, ఏ
నేస్తము వెంటలేని తరు
ణీమణి, పీడకలేదొ జాగృతిన్
వాస్తవమౌటచే కరము
ప్రాణభయంబున క్రుంగి పోయి, సూ
ర్యాస్తమయంబునందు తిమి
రాంధము చూచినభంగి ఇ ట్లనెన్!

నే ప్రజాస్వామ్యలక్ష్మిని, ఈ ప్రపంచ
మందు అందున ఈదేశమందు నాకు
ఉన్న భావి యదేమిటో ఉన్నదున్న
యట్లు ఎరిగించు మంచు నన్నడుగ దొడగె!

గతకాలస్థితి మారిపోవు నని ఆ
కాంక్షించి నే మోసపో
యితి; నాజీవిత వర్తమాన మిదిగో
హీనంబుగా మారె; సూ
నృతశీలీ కవిసత్తమా తెలుపవా
నీవైన నా జాతక
స్థితి ఎట్లున్నదొ ముందు ముం దనుచు సం
దేహాత్మ నల్లాడగా!

జాతకము చెప్పగల్గెడి జ్ఞాన మేది
నవ్వులాటల కైనను నాకు లేదు
జాతకమ్ముల జోస్యాల జాడ లెరుగు
కాలవేదిని నే కాదు కాదనంటి!

నామాట వినక ఆసతి
సాముద్రిక మెరుగకున్న సత్యా సత్య
మ్మామూలాగ్ర మెరింగెడి
స్వామివి నీవంచు నను ప్రశంసింపగనే!

అమ్మా! నీవు త్రివర్ణకేతనము రా
  జ్యాంగంబు చేబూని, కం
ఠమ్మందో ప్రగతి ప్రణాళికల దం
  డల్ దాల్చి సంక్షేమ గీ
తమ్ముల్ పాడుచు జన్మభూమి విల వి
  ద్యాబుద్ధి విజ్ఞాన మా
ర్గమ్మందున్ నడిపించ నెంచి కడు వై
  రాశ్యమ్ము పా లైతివా!

అనవుడు ఆ దుఃఖితమతి
కనులం దొక కొత్తకాంతి కాన్పించెను ఏ
మని చెప్పగలను; తనయా!
వినుమనె తన గుండెలోని వేదన కాంతన్.

కులమతకలహ సంకుచితాత్ములకు సర్వ
సమతా ప్రబోధమ్ము సలుపబోయి
దోపిడి దౌర్జన్య దురిత దుర్మార్గాల
పెత్తనమ్ముల మట్టు పెట్టనెంచి
అన్ని విద్యలు నేర్చుకొన్న అవినీతిని
ద్రుంచి మానవుని రక్షించ దలచి
హింస విధ్వంస రహిత సమాజోన్నత
విలువల కేలెత్తి పిలువ జూచి
నవశతాబ్ది సహస్రాబ్ది అవతరించు
తరుణ మాసన్నమౌతున్న ధరణిలోన
భరతజాతికి జయపరంపరలు గలుగ
వరము లిడబోయి నే నేల భంగపడితి!

నేను గ్రహియించినాను నీ నిర్నిమీష
జరుగకూడని దెట్టుల జరిగె ననుచు
జాలిపడుచుంటి నీ అపజయము లరసి
చెప్పుమందువా నా గుండె విప్పి నిజము!

కులమత కుట్రలవలలో
తెలియక పడినావు పక్షి తీరున, నరహ
త్యల రాజకీయములు, నిను
బలిగొన, వ్యూహమ్ములెన్నొ పన్నుచునుండెన్!

నామాటల్ వినగానె ఆమె మదిలో
నానాస్మృతుల్ వెల్గి ఏ
మేమన్నావు కవీశ్వరా వివరముల్
ఎట్లున్నవో తెల్పుమం
చామాత్మ ప్రతిరూపి కోరినది; నే
నట్లేయనన్ ఆమె ఏ
మోమాటమ్ములు లేక కూర్చొనెను వా
గ్మూలమ్ము విన్నట్లుగా!

భూస్వామ్య ధనస్వామ్య బ
లస్వామ్యములేను గాక రహిలో గల ఏ
ఏస్వామ్య మైన బెదరు భ
యస్వామ్యము కుట్ర పన్నె హతమార్చగ నిన్!

హత్యాగండము నీదు జాతకములో
అత్యుగ్రమై యున్నదో
సత్యాసత్య మెరుంగజాలని ప్రజా
స్వామ్య ప్రబోధావిధీ!
దైత్య స్వార్థపరత్వ శక్తులకు నీ
ధర్మాధర్మ సందేహ సా
హిత్యమ్మే అనుకూలమైనదట ని
న్నే అంతమొందించగన్ !

రాజకీయాని కిపుడు అర్థమ్ము మారె
దేనివో ఒక దాని ఏతీరు నైన
వంచవలతోడ కాని హింసించి గాని
హత్యచేయక రాజకీయమ్ము కాదు.

ఓట్లనో నోట్లు బుల్లెట్లు కాట్లువేయు;
ప్రజల పంచేంద్రియాలపై వ్రాలిపడుచు
కాకి క్యాసెట్లు బోధించు, కావు కావు
అనుచునే పచ్చబద్దాలు అన్నిచోట్ల!

అంటినో లేదా ఆమె నేత్రాంచలముల
అశ్రువులు తుడుచుకొనుచు అనియె నిట్లు
"నీవు చెప్పిన దానిలో నిజము కలదు
ఇంక విశదీకరించుమే జంకు లేక"!

హంతకు లెవరో నీకు
ధ్వాంతములో ఆప్తు లెవరొ అగుపించని దు
ర్ధ్వాంతములో మునిగిన నీ
కెంతని వివరింతుబుద్ధి హీనుల చేష్టల్.

వల్లధనార్జన కెల్లలు లేవయ్యో
పేదవానికి తోక బెత్తెడేను
అధికారమునకు బాధ్యత లేవి లేవయ్యో
ఓటర్లకో గుండె పోటులయ్యో

యజమానులకు అక్రమార్జన లెన్నెన్నొ
శ్రామికులకు నిరశన వ్రతములు
అవినీతిపరులకే ఆయురారోగ్యాలు
చట్టబద్ధులు కాలసర్పహతులు

ఏమి స్వాతంత్ర్యమోగాని ఎందు కనిన
"బడితగలవానిదే యయ్యె బర్రె"నేడు
పీడితులు తాడితులు ఊరుపేరు లేని
జనగణమునకు మిగిలెను "జనగణమన".

హత్యలే హత్య లయ్యె, ప్రహ్లాదు లెవరు
"సత్యనారాయణా" అంటె హత్య లనిరి
హత్య కాకుండ మిగిలిన సత్యముంటె
ఆత్మహత్యల పాల్జేసె అంధనీతి!

తల్లడిలి ప్రజాస్వామ్యమతల్లి అపుడు
దేశ రక్షణ గూర్చి ఆవేశపడుచు
మాయమర్మాత్ము లగు ఆతతాయిల నిక
మట్టిగరిపించుయుక్తి చూపెట్టు మనెను.

సంగతి తెలిసినది గదా
దొంగలపా లైన నీ బ్రతుకునకు నీ వే
భంగిని కారణ మో రా
జ్యాంగములో తరచి చూడ అవగత మౌలే!

ఇన్ను మిన్నెరిగి నట్టి నీకన్ను కట్టి
ఆడు నాటకములను, పవాడములను
ఆపవలెనమ్మ నీవె చిద్రూపమెత్తి
ఆత్మరక్షణ కెందుకమ్మా అటాట్య!

కలముతో వ్రాసెడి కమనీయ చరితను
కత్తులతో వ్రాయు కంటకులను
మట్టిని పైడిగా మలచెడి ప్రగతిని
శిలువవేసెడి గ్రామసింహములను
సుధలు పారిన నేల రుధిరాల తడిపెడి
ఉన్మత్తవాదనాపోహమతుల
హద్దులు లేని ద్వేషాగ్ని వర్షము సరి
హద్దుల కురిపించు అరిగణముల

వేయికన్నులతో కనిపెట్టుచుండి
కనికరించక వారిని కలలనైన
దేశ గౌరవ సౌభాగ్య దీప్తి ఆన
మట్టుపెట్టుము పౌరుష ముట్టి పడగ!

"ధర్మ సంస్థాపనార్థాయ" ధరణికి దిగు
దేవుడే విన్ను రక్షించు దీక్షబూని
ఎట్టి అవతార మాయుధ మేదియైన
తప్ప వాతనికిని ముప్పు తిప్ప లిపుడు.

ఆయినను నీ హృదంతర క్షు
ధాగ్నులు ఆర్పగజాలుశక్తి ఏ
దయినను నీ ప్రజాబలమె
అన్నిటికన్నను మిన్నయౌ; దయా
మయుడగు దైవమైన జన
మానస శక్తియు తోడు ఉన్ననే
జయమది నిశ్చయమ్ము! శుభ
జాతక వౌదువు నీవు మాతరో!

అని నేను మంగళము పా
డిన యట్లనుభూతి పొంది రీవిగ లేవన్
వినపడె వీధులలో నిజ
జనగణముల స్వప్నలోక జయనాదమ్ముల్!

## అవధాన కవితా హంస

తిరుపతి వేంకటేశ్వరుల
ధీవిభవ మ్మవధానమందు కొ
ప్పరపుకవీంద్రచంద్రుల ప్ర
భాప్రతిభావిభవమ్ము, భావనాం
బర రసకేళికానుభవ
భర్మము కట్టిన తెన్గు మేడలో
సరసవినోది వాణి దొరసాని వ
సించును మోహనమ్ముగా!

ధర ఆశుకవితావధానమ్ము కెదురైన
అన్ని సమస్యలన్ అధిగమించి
వర్ణించు మనుచు సవాలు చేసిన కావ్య
వస్తువు లిడిన ప్రశస్తు లంది
దారితెన్నులు లేని దత్తపదాలకు
రూపురేఖల జీవదీప మిచ్చి
న్యస్త నిషిద్ధ ప్రయాసాక్షరములను
చేర్చి మార్చి సుగతి కూర్చి, తీర్చి
మధుర మోహన అవధాన మంత్రశక్తి
జాడలను క్రీడలను చూపినాడ వౌర!
పృచ్ఛకుల ప్రేక్షకుల బుధవిదుల ఎదలు
మేడలా నీకు మోహన మేడసాని!

అర్ధనిమీలితనే త్రా!
స్వార్థములేనట్టివాడ, సాహిత్యశ్రీ
తీర్థుడ, మేసామోహన్
సార్థక షోడశిగుణితపు అవధానివహో!

లండను హ్యూస్టను మొదలగు
ఖండాంతరముల అఖండ కవితాశు సుధా
భాండము నిడికొని శుభకర
తాండవమాడిన శతావధానకవీశా!

అభినందింతు శతావధాన కవితా
హంసాత్మకా నిన్ను నే
నభినందింతును ధారధారణ సువి
ద్యావైణికా నిన్ను నే
డభినందింతును, ఆంధ్రవాఙ్మయ వికా
సానంద సంధాయక
ప్రబలం దీవును క్రాంతి కాంతి కిరణ
ప్రాభాతమైనందుకున్.

# కళాతృష్ణ

అందము అందమే మనకు
　　అందిన అందక పోయినన్, మన
స్పందన వేరు తార్కిక వివాదము వే
　　వాదము వే రవి రెండు భావనా
నంద నదీ తటద్వయమునా విలసిల్లను,
　　నా విలసిల్లను, ఇంద్రియానుభూ
తీందిర పేదవోదు పడగెత్తిన
　　గెత్తిన ధీబల శాస్త్ర మెంతయున్!

రాలును రప్పలున్ పనికి
　　రానివి కొండలు, గోతులున్ వినా
గాలియు నీరు లేని ఎడో
　　గందరగోళము చంద్రగోళమం
దాలకు ప్రోలి కాదనచు
　　అద్భుత చిత్రము లెన్ని చూపినన్
రేల నభోంతరాల శశి
　　రేఖల జూచి చలింపకుందుమా!

ఎముకల గూడు నాడులకు
　　ఇల్ల కళంక కళంక రక్తనా
ళముల సమూహమున్ పలల
　　రాశి కళాసప్రతిత్తియేను, దే

హామని ఎరుంగు డాక్టరుకు
అందము చందము, కానుపించదా
రమణుల చూచినప్పుడు స
రాగ పరాగము పొంగులెత్తదా!

మబ్బులందు పైనించి విమానమందు
ఏమిగల దిందులో, ధూళిధూమ మనుచు
అనుకొనుచు నేలపై దిగి, అంబరాల
తేలు జలదాల అందాల తేలిపోమె!

బాధపడెడివారు బాధించు వారును
వట్టి అభినయించు వారె యంచు
తెలిసి కూడ వెండి తెరమీద దృశ్యాలు
కాంచి కంట నీరు నించు కొనమె!

పుట్టినది గిట్టు, బ్రతుకు బుద్బుదమె యంచు
ఎరిగియున్ నరుల్ చావుపే రెరుగనట్లు
ప్రాకులాడరె యశము, ప్రాభవము కొరకు
వాస్తవముకన్న బ్రతుకులో భ్రాంతి మిన్న!

చంద్రవిజయమ్ము, విజ్ఞాన శాస్త్రజృంభ
ణమ్ము, ఊహా జనిత కపనమ్ములకును
కళలకు విఘాత మనెడి సుద్దు లవి మిథ్య
శాశ్వతము కళాతృష్ణ ఆ జాబిలి వలె!

## జాషువా! పీడితజనవాసవా!

కులమత మౌఢ్యమ్ముల పై
కలమెత్తిన మానవత్వ గళమెత్తిన కో
కిల సింహనాదకవితో
జ్వల జాషువ భానుమూర్తి వాగ్రస కీర్తీ!

చీకటి గుడులలో చిద్రూపమెత్తిన
గబ్బిలమే నీకు గంటమయ్యె
ఆకలి బడులలో కేకలు పెట్టిన
కడగండ్లు నీ కావ్యకంఠ మయ్యె
నీచమారీచగజనీ గర్వ మడచిన
పిరదౌసి నీశక్తిపీఠ మయ్యె
సంపుటీకృత మైన సత్యసాహిత్య చే
తనము నీ విజయపతాక మయ్యె
షాజహానుని ప్రేమార్ద్ర తాజమహలు,
సర్వసమతాప్రబోధి శ్మశానభూమి,
శిశిర పీడిత దళితుల జీవితములు,
ధన్యమైపోయె నీ భావ దర్శనమున.

ప్రవిమలగుణ సాగరుడవు
నవకవితా పద్య పద్మనాభుడవు ప్రజా
కవిశబ్ద రసాకృతుడవు
శివసుందర సత్యభావ శిల్పివి నీవే!

జనుల జీవనాడులను తంత్రులను చేసి
వినిచినావు రుద్రవీణ వాణి
కపటకలుషనాటకములాడిన చరిత్ర
బుద్ధి వచ్చి తప్పు దిద్దుకొనియె!

శృంగారమునకు మేల్ బంగారు వన్నెల
 భాష నేర్పిన ప్రేమవాది వీవు
స్వార్థ పంకిలమైన సంస్కృతికి విశుద్ధ
 పథము చూపిన క్రాంతివాది వీవు
ఆస్తిక నాస్తికాద్వైత సిద్ధామృత
 దృష్టి వెలిగించిన ధిషణ వీవు
కవ్వించు విషయము నవ్వించి చెప్పెడి
 హాస్య భాష్యాల విన్యాస మతివి
నిస్తులప్రతిభతో కావ్యవస్తువులను
అమర మొనరించు విద్యారహస్య నిధివి
ప్రస్తరాలను పరిమళ ప్రసవములుగ
మార్చగలిగెడి నైపుణి నేర్చినావు!

వాదాల పేరు లెందుకు
వేదాలె శిరమ్ము లూపు విజ్ఞతగల భా
వోదయ రోదసి నీకవి
తాద్భుక్పథ; మంతకన్న ధర్మము గలదా?

కారణజన్ముడా! భరత
　　ఖండ పురోగతి కడ్డులౌ దురా
చారములన్ని త్రుంచుయువ
　　శక్తుల భీమవిజృంభణాన నీ
పేర ప్రతిష్ఠితమ్మయి ప
　　విత్రత జెందిన సాహితీ పుర
స్కారము నాకు దక్కినది;
　　జన్మతరించినదయ్య జాషువా!

అన్నా! నిన్ కబళింప లేదు మృతి, ది
　　వ్యాలోచనా దీక్షలో
కన్నుల్ మూసి అనంతకాలవిలస
　　ద్ధ్యానమ్ములో లీనమై
యున్నావందులకే భవత్కృతులభా
　　వోద్వేగ మీ జాతిలో
చెన్నారున్, వినుకొండ నీ ప్రతిభకున్
　　చిహ్నం బగున్ జాషువా!

# శ్రామిక విజయం

నాగటి చాలులో నడిచి
నాటుచు విత్తనముల్ శ్రమించుచున్
సాగెడి రైతు కూలిజన
శక్తికి తోడుగ వెంటబోవలెన్
జాగిలమట్లు కాలము; వి
షాదమయమ్మగులోక మందు, ఏ
యోగములైన నేమి తల
యొగ్గవలెన్ శ్రమయోగ సిద్ధికిన్.

శ్రమయే సృష్టికి ప్రాణము
శ్రమయే పరిణామ చరిత రథసారథియున్
శ్రమ సమ్మెకు దిగెనో, కా
లమునకె మూర్ఛిల్లు ఘోరప్రళయము వచ్చున్ !

కార్మికున కందుకే నమస్కారమనుము!
కర్షకుని కందుకే పురస్కార మనుము
పొట్టకూటికి మట్టిలో కొట్టుకొనెడి
కూలినాలికి జేజేలు కొట్టవలయు!

కులమతకుడ్యాలు కూల్చివేసెదమన్న
'బాస'లకజ్ఞాత వాసమయ్యె
అవినీతి ఎందున్న అంతు చూచెదమన్న
బెదిరింపులన్నియు బెదరిపోయె

సమసమాజమ్మును స్థాపించగలమన్న
దీక్షలన్నిటి కురిశిక్ష లాయె
రూపాయి విలువను కాపాడుతామన్న
అభయ ముద్రలు పశ్చిమాద్రి గ్రుంకె
భరతజాతి ప్రగతిలోక బాంధవుడగు
దేశరాజ్యాంగమెంత ఆవేశపడిన
కదలనంటున్న చీకట్లు వదలు టెట్లు?
శ్రామికాళికి న్యాయము జరుగుటెట్లు?

కష్టజీవుల వెతలెల్ల, కవితలయ్యె,
చిత్రకారుని రంగులచిత్రమయ్యె
గాయకులగళ సీమల గానమయ్యె
కాని, కష్టాలు తొలగుటే కల్ల అయ్యె!

చదువులు శాస్త్రముల్ ప్రకృతి
శక్తులపై విజయాలు, జ్ఞానసం
పదలు, ప్రబోధముల్ సకల
మానవజాతి సుఖాల కోసమం
చు దలపకన్ సువిద్యలను
క్షుద్రముగా పరపీడనమ్మికే
వదలక వాడుకొంచు మను
స్వార్థపరుల్ నశియింపగా వలెన్!

నల్లబజారులో నానావిధములైన
వేషాలు వేసెడి విద్యలెరిగి
ఆఫీసులందు సర్వావస్థలందు, న్యా
యార్థుల పితుకు వ్యూహములు పన్ని
కాంట్రాక్టులందున కాజేయ వలసిన
దెంత ఎవరెవరికో తంతు లెరిగి
రాజకీయాల దుర్గాలు జయించేటి
వక్రమార్గాల గోప్యమ్ములెరిగి
ఏప్రణాళిక పథకాలు ఎట్లు ఉన్న
శాసన నిబంధవాదు లే సరళి ఉన్న
ఎవరు అధికారమున ఉన్న ఏమి యైన
జయము సాధించు అవినీతి జగతినేత!

పశ్చిమదేశాల ప్రగతి అద్భుతమని
పర్యటనలు చేసి వచ్చి చెప్పి
మనవాళ్ళు ఏదేశమున మన్న ప్రతిభకు
ప్రతిరూపులని సభాప్రకటన లిడి
అమెరికాలో రోడ్లు ఐరోప వాకిళ్లు
అద్దాలు అని బల్ల గ్రుద్ది చెప్పి
అటు జపానైనను ఇటు సింగపూరైన
ఎంచ జాలని వృద్ధి గాంచెనంచు
గొంతువిప్పి చేతులు త్రిప్పి అంతులేని
మెప్పులను కురిపించు వారెప్పుడైన

బాగుపడకుండ భారతావనికి వారు
చేసినట్టి పాపాలేవి చెప్పరేమి?

ఎన్నిటికైనను శ్రామిక శక్తుల
ఈక్షణపంక్తులు మార్గముగా
మిన్నున దాగివుడిప్పుడదే, కను
మేరల కన్పడు జర్జరితా
పన్నజనావనుడౌ నవ భానుడు
వచ్చును, ఈపెనుచీకటి వి
చ్ఛిన్నము చేయును; నాశము చేయు, అ
జేయత రాక్షస దర్పములన్.

# ఆత్మశ్రుతి

ముద్దులు మూటగట్టు నగు
మోమును నామదిగాంచి మూర్ఛిలన్
నిద్దురలేచి నా గళము
నిర్వచనీయ రసానుభూతిలో
పద్దెములల్లి పాడుకొను;
భావమెరింగిన భాష తప్పులన్
దిద్దుచు సత్యవృత్త పరి
ధిన్ విడనీయదు నామనోగతిన్!

ఆకలిలేని కోకిలము
నై ప్రమతీప్సరసాల శాఖపై
చీకటి గొంతు విప్పశ్రుతి
చేసితి "కోహము, కోహమన్స్వర"
శ్లోకము; సృష్టి మూలగత
శూన్యము "సోహము సోహ" మంచు, నా
లో కలిగించె సత్య గుణ
రూప విచార వివేచన స్పృహన్!

నను గని పెంచినట్టి కరు
ణామయి; సృష్టిరహస్య విద్య నా
జననములోన కన్గొనిన
శారదలక్ష్మి; ప్రపంచ మెల్లనా

కనుగవలోన చూచుకొను
కాంతి కిరణ్మయి; దేశకాల బం
ధనముల చిక్కి చిక్కని అ
నంత రసాకృతి మాతృమూర్తియే!

ఎనుబదియారు వత్సరము
లీ జగమందు వసించి వెళ్లిపో
యిన నను కన్నతండ్రి కను
పించును నా పరితప్త చేతనా
వనికలమీద; నేను పసి
బాలుడనై పరికించుచుందు జీ
వన మరణాలనే యుగళ
పాత్రల నాటక కాలచిత్రమున్!

త్యాగముచేతనే బ్రతుకు
ధన్యత జెందును; అందుకోసమే
త్యాగము చేయగల్గెడి వి
ధాన మెరుంగుటె మానవాళికిన్
యోగము, నిత్య జీవన ప్ర
యోగము కావలె; ఉత్తమోత్తమ
శ్రీగుణ శీలివై రచన
చేతును త్యాగమహాప్రబంధమున్!

వీణయే లేని సరికొత్త వైణికుడను
వేణువే లేని ఒక వింత వైణవికుడ
చేయిచాపిన వీణయై మ్రోయుచుండు
పెదవి విప్పిన వేణువై ఎదల కదుపు!

నేను కవీశ్వరుండ నన
        నేరముగాని రసార్ద్రకావ్య ని
ర్మాణమె ప్రాణమైన సుకు
        మారుడ, అక్షర భావ శిల్ప సం
ధానుడ, నిత్య సత్య శుభ
        దాయక జీవనగాన గర్భసం
తానము నేను, నేను పరి
        తప్త జగజ్జననీ ప్రసన్నుడన్.

పాడువేమియును లేని నిడివేమియునులేని
        చుట్టుకొలతలు లేని శూన్య మగుచు
కనుపించనట్లుండి కనిపించునట్లుండు
        కటిక చీకటియును కాంతి యగుచు
మాటాడలేని ఏమాటయున్ వినలేని
        మౌనాలకే మర్మమౌన మగుచు
మనవెంట పడిరాని తనవెంట గొనిపోని
        తత్త్వమౌ ఆత్మబంధుత్వ మగుచు
వృత్తముల జీవనానందవృత్తములకు
కేంద్రబిందువౌ సృష్టి మహేంద్రజాల

లీలలన్ కాంచగల్గెడి జ్వాలనేత్ర
రవినె యనుకొందు తిరువెర్రి రాత్రులందు!

నేను విమానమందు పయ
నించెడి వేళల, నింగివంగి నా
లోనికి తొంగిచూచును
"హలో" యని పిల్చును; భావవీణపై
గానము చేయు నాకు రస
కావ్య విలాసము చూపు, నాటిరం
భానలకూబర ప్రణయ
మార్గములో సితమేఘ మాలికల్!

జీవుడు పుట్టినప్పుడు; వ
చింపగరాని విధాన భూమిపై
జీవనయాత్రసల్పి, పెను
చీకటిలో కనుమూయునప్పుడున్
నా వికచాత్మలో ప్రణవ
నాదమెదో వినిపించుగాని, త
ద్భావమెరుంగలేక భవ
బంధములే విడిపోవు బాపురే!

తనయుడుగ ఇచ్చితిని తలిదండ్రులకును
తండ్రిగా ఇచ్చినాను నా తనయులకును
ఇచ్చుటయెగాని ఆర్థించు టెరుంగ నట్టి
జీవితము నిట్లె ముగియింపజేయ దలుతు!

నను ప్రేమించిన మిత్రుల
నను ద్వేషించిన జనమ్ముమ్మనైనను సమద
ర్శనమున ప్రేమించితి ఈ
గుణ మిట్లే వరలుచుంట కోరుచునుందున్!

అందరు వ్రాయు పద్యములు
అందరు వ్రాసెడి గద్యముల్ రసా
నందము పంచునేని సృజ
నాత్మక చేతన పెంచునేని, ని
ర్ద్వంద మనస్కతన్ చదివి
దార్శని కానుభవమ్ము పొందెదన్
స్పందన కూర్చలేని కృతిపై
బునకొట్టను జాలి చెందెదన్!

మనమున గల భావములకు
ఘనతరముగ వాస్తు రూప కల్పన చేతున్!
కనుపించు వస్తువులలో
కనుపించని భావసత్యకాంతులు నింతున్

హాసము చిందు నా కవిత
లంబుజ పత్రముల ట్లొకప్డు; లో
గాపిలి ఏడ్చు ఏ ప్రళయ
గర్జనమోవిన వట్లొకప్పుడున్

త్రాసము తాపమున్ కలవ
　　రమ్ములు లేక నొకష్ట పూర్ణ మౌ
నాపనయోగదర్శనము
　　నన్ వినిపించు నిరక్షరశ్రుతుల్!

తామే ప్రశ్నలు వేసుకొంచును సమా
　　ధానమ్ములున్ తామె ఎం
తోమీమాంస యొనర్చి చెప్పుకొని, సం
　　తోష సంతాప మ
ధ్యే మార్గమ్మున జీవితాశ్వముల దే
　　దీప్యముగా తోలు, నా
ప్రేమారామ తురీయతత్వ కవితల్
　　స్వేచ్ఛానురాగాలతో!

క్షణముల్, రోజులు, వారముల్ నెలలు వ
　　ర్షమ్ముల్ అకాండమ్ముగా
వినదించున్ పరిణామ సూచిరుతులై
　　నిర్నిద్రకాలోరు వా
హినిపై సాగు మదీయ దార్శనిక సా
　　హిత్యాత్మ నాదమ్ములై
వినువీధిన్ తలపించు వాస్తవికతా
　　వీధిన్ విలాసమ్ములై.

కాళీయ ఫణి ఫణాగ్రముమీద శ్రీపాద
నృత్యము నాలేఖినీ గమనము
అసురత్వ గర్భకుహరభేదనము చేయు
నఖతాండవమ్ము నా నవకవనము
దుర్నీతి దశకంఠు దునుమాడ జృంభించు
జ్యాగర్జనమ్ము నాశబ్దరవళి
క్ష్మాతలద్యోతలాక్రమణ చేసిన, బలి
వైరి పాదమ్ము నా భావపరిధి
నవతస్వచ్ఛంద యువత మానవత సమత
హక్కులకు చెక్కు చెదరని అభయశక్తి
నా తపోజాత నిటలాక్ష జాతవేద
కీల సుస్నాత నా సాహితీలతాంగి!

పుట్టినదాది నన్ కలల
పూవుల తొట్టియలోన పెట్టి, జో
కొట్టుచు వెల్గు చీకటుల
కోణము లంటగ ఊపుచున్ ఏదో
పిట్టకథల్ కబుర్లు విని
పించుచు బొమ్మల నాడిపించుచున్
గుట్టు లెరుంగనీని బ్రతు
కున్ నడిపించును కాల మక్కటా!

ఏదో శోధించాలని
కాదో ఔనో వితర్క కాననమున,
నేదో బోధించాలని
దోదీయమనః ప్రవృత్తితో విహరింతున్

కోరి కోరి వేసికొంటి ఎడారిలో
నీరు కనుగొనగ గుడార మొకటి
చూడు చూడు మంటు సుడిగాలి చెలరేగె
మిగిలివాను నేనె మింటి క్రింద.

గంగిరెద్దుల ముద్దు గంతులాటల గూర్చి
గుమ్మడి పూలరాగమ్ము గూర్చి
ముంగిళ్లపై వ్రాలి ముచ్చట గొలిపెడి
గొబ్బిళ్ల గుజ్జన గూళ్ల గూర్చి
ముసుగుమూటల, చలి, ముద్ద గట్టించిన
ముదుసళ్ల మూల్గుల మొరల గూర్చి
జిగిబిగి కౌగిళ్ల శ్రీకారములు చుట్టు
యువదంపతుల అనుభవము గూర్చి
మనసుమనసును అతికించు మమత గూర్చి
మనిషి మనిషిని కలుపు సమతను గూర్చి
వివశతను అల్లుకున్న నా కవితలన్ని
ఏటిలో దూకి కన్నీటిపాట లౌనా!

సిరికొండలో పుట్టి చీకటి గదిలోన
కట్టిన తొట్టిలో పట్టి నైతి
కొండకోనల్లె వైకుంఠమ్ముగా నెంచి
లీలగా తిరిగిన కేళి నైతి
వాగువంతల గట్ల, పచ్చిక బయళుల
పసుల మేపిన పశుపాలు డైతి
చదివించుమని పోరు సల్పి పొరుగూళ్లలో
బడుల కేగిన వింతబాలు డైతి

అది ఇదన నేల, వాణిదుర్గా భవాని
అతుల కరుణామృతము త్రాగి అక్షరాను
భూతిలో తప్తమైన విభూతి నైతి
గుడ్డి తిమిరాల నే బాపురెడ్డి నైతి!

తన ఉనికి తానె తెలియనంతటి విశాల
సృష్టినే చుట్టబోవు నా దృష్టిని గని,
కోటి కోటి నక్షత్ర చక్షువులు కూడ
చాలవని కుందు నింగియే జాలిపడును.

# హాలండు పూల హేల

ఎగసిపోయి మిన్నంట నే నెగసిపోయి
సింధువుల క్షేత్రములు గిరి శృంగములను
దాటి వ్రాలితి మంచుపూతోటలోన
రాగసాగర నవ్యతీరాల లోన-

ఎచ్చట చూచినన్ సుమము
    లే సుమకోమల బాలలే సిరుల్
విచ్చిన జాడలే మధువు
    వెచ్చదనమ్ములు పంచు వాడలే
పచ్చిక బీడులే ఘటని
    భ స్తన గోవుల మందలే ఒహో
అచ్చర లుండు స్వర్గ మిది
    యా యనిపించెడి వింత నేలలే.

చూచితి సౌందర్యమ్ములు,
చూచితి మధురుచులు, తాకి చూచితి కౌనుల్
చూచితి నవవాసన, విని
చూచితి జీవనగళాలు, చోద్యము లెన్నో!

"సురజగత్తున ఈ బీరు దొరకబోదు
కాన మవపార త్రాగు డిక్కడనె" యంచు
కొంటెనవ్వుల గుబ్బెతల్ కొసరి కొసరి
అమ్మెదురు బారులను బీరు హైనకీను.

పని యొనరించు వేళ పార
        పాటున సైతము విశ్రమించ, రా
పని సమయమ్ము తీరగనె
        పక్షులు పోలిక స్వేచ్ఛగా గృహాం
గణములయందువో ప్రియుల
        కౌగిళులందునొ పానశాలలం
దునవొ వినోద మోదముల
        తో పులకింతురు కార్యముక్తులై.

భగవద్భక్తి కళానురక్తి చిర సౌ
        భ్రాతృత్వ సేవా సుధా
పగలే తుంగ తరంగ హస్తములు పై
        పై కెత్తి గొంతెత్తి మో
క్షగవాక్షమ్ములు విప్పి ఏవొ ఉపదే
        శ మ్మిచ్చుచున్నట్లు నా
కనిపించెన్ వినిపించె చర్చిగుడి గీ
        తాలాపముల్ అచ్చటన్.

పిన్నలు పెద్దలు కన్నెలు ప్రౌఢలు
        భేదము లెంచక వీధులలో
మన్ను చివుర్చగ మిన్ను గగుర్చగ
        మంచు పరాగము వించుకొనన్
వెన్నెల కన్నెలు పాటలు పాడుచు
        వెచ్చని నాట్యము లాడి రహో
కన్నుల చూచియు నమ్మము అచ్చటి
        "కారివిపాలు" మహోత్సవముల్!

విడి విడి నాట్యముల్ సలిపి
　　వేసట జెంది, రణించ వాద్యముల్
తడబడ పాదముల్ ఎదలు
　　తత్తర మొందగ, నాట్యశాలలం
దొడలు ఒడళ్ళు ఏకముగ
　　ఒక్కరి నొక్కరు కౌగిలించి ప్రే
ముడి యొనరింపగా నటనముల్
　　యువతీ యువకుల్; కనన్ వలెన్!

కాచిన ఎండలో తళుకు
　　కాంతులు చిందెడి స్వర్ణ రాసులో
లేచిన సాగరోర్మికల
　　లేచిన సుందర రత్న రాసులో
తోచదు, నగ్నగాత్ర నవ
　　తోరణ పంక్తులు కట్టి సొంపుగా
బీచులు సల్పునేమొ కను
　　విందుగ గ్రీష్మమహోత్సవమ్ములన్.

ముద్దులుగార, జార జన
　　మోహన నగ్నవయో విలాసముల్
అద్దపు శాలలన్ మెరయ,
　　అత్తరు లత్తుక కాటుకల్ ఎవో
అద్దిన అందముల్ మరుని
　　అమ్ములుగా అవి సల్పు కామపున్
విద్దెల వీరవేశ్య లట
　　వింతలకే గిలిగింత లయ్యెడివ్!

"రంబ్రాంటు" తైలచిత్రాలశాలలను, "మ
స్థాఖు"లో కుడ్యచిత్రాలు చూడు
మంచి కంజలిపట్టు కంచు విగ్రహములు
"జగతి న్యాయస్థాన" శాంతిమహలు
బృందావనమునకే విందౌ కు కెన్‌హోఫు
యమున బోలిన రైను రమణి చూడు
ఆలమందలు చూడు అభిసారికల చూడు
పాడిపంటలు వనప్రకృతి చూడు
చూడు "రాటరడాము" లో ఓడరేవు,
"స్ఖివిఎంగను" లోని విచిత్రములను,
మేడలను చూడు, వజ్రాలవాడ చూడు,
గాలిచక్రాల డైకులలీల చూడు!

ఏగుము ఒక్కసా రయిన
హేగు మహానగరమ్ము చూడగా
ఏగుము ఇంద్రభోగముల
నేలెడి ఆంస్టరడాము చూడ, త
త్సాగరతీర రమ్య సుమ
సాగర డోలల తేలిపోవుచున్
సాగుము డచ్చి వీరులు స్వ
శక్తి సృజించిన దేశమున్ కనన్.

# నగ్నసత్యం

అదిప్రశాంత విశాల వనాంతరమ్ము
అది సరోవర తీర వయాళి భూమి
వర్ణమత లింగ జాతి వివక్షలేని
సర్వసమతా స్వతంత్ర సంచార సీమ.

ప్రకృతి ఒడిలో అమాయిక పక్షి వోలె
ఆడుకున్నాను నిర్వికారాత్మ తోడ
చంటిపాపను బోలు నా ఒంటిమీద
నూలు పోగైన లేదులే గాలి తప్ప!

హరితారణ్య విభూషితాచల పరి
వ్యాకోచ శీతోర్మికా
సరసీధామము చేరాగానె కృతకా
చ్ఛాదంబులన్ తీసిస్త్రీ
పురుషుల్ నగ్నశరీరులైరి బిడియం
బున్ భీతియున్ లేక, దు
ష్కరమౌ జీవితపార దర్శికతలన్
సాధించుచందంబుగా.

పాతబడని తీసిపారవేయగలేని
నగ్నతను ధరించినారు వారు
ప్రాణ విత్తమాన భంగ భయము లేని
స్థితికి తాపసు లయి చేరినారు.

ఏమి దిగంబరత్వ మది
ఏమి విచిత్రవినోద సీమయో!
కామినులైన నేమి దృఢ
కాయులు పూరుషులైన నేమి స్వే
చ్ఛామయమైన ఆ ప్రకృతి
శాంభవి అంకములో విశుద్ధని
ష్కాముకతన్ యథేచ్ఛగ
పచారులు చేసిరి నిర్మలాత్ములై

పిల్లలు పాపలు లేరట
ఎల్లరు పసిపిల్ల లౌటయే కారణమో!
కల్లాకపటా లెరుగని
చల్లని కెరటాలవోలె సాధువు లౌటో!

అగ్నికీలల బోలు ఆనగ్నతనుల
కంట బోవేమొ మలినములను నవేవి!
పారదర్శిక రూపసపావనములను
వీడునో వ్రీడ అనుదిన విషయమవాంఛ!

రాలును రప్పలున్ తరులు
రంగుల పిట్టలు గట్టులన్నియున్
గాలియు నీరు ఆకసము,
కాంచుచు ఆనవవగ్నలీలలన్

ఏిలవలేశ మైన నిర
 సించను లేదది యేమి చిత్రమో
కాలము సాగిపోయినది
 కాంచియు కాంచని యట్లదంతయున్.

రాయంచలను బోలు రమణీమణులజాచి
 తత్తరపడలేదు చిత్తమచట
అపురూప వనితల అంగాంగములు చూచి
 చిలిపిచేష్ట లవేమి చేయలేదు
యువతీయువకులను నవదంపతుల జూచి
 ఉదయించలేదు దురూహ లేవి
జలకేళు లాడు ఆజనవైభవము జూచి
 రేకెత్తలేదు ఉద్రేకమేది
వింతలో వింత ఆసన్నివేశమందు
దాచుకొనలేవి నా ఒళ్లు చూచుకొనుచు
ఆత్మ పరమాత్మ దర్శనమైన యట్లు
పరవశించితి భవభయభ్రాంతి వీడి.

అదికలయో నిజమ్మో! ఎది
 యైన నపూర్వమహానుభూతి సం
పద అది; భాషలందు పరి
 భాషలయందు వచింపరాని అ

భ్యుదయమె; స్వర్గలోక పర
యోగమె, వాదవివాదతర్కవున్
చదువులు శాస్త్రముల్ తెలుపజాలని
నగ్ననిగూఢ తత్వమే!

పలు వేషంబులు దాల్చి నాగరికతా
భాసన్ ప్రదర్శించు కు
ట్రలు స్వార్థోగ్ర కుతంత్రముల్ కపట దు
ష్టవ్యూహముల్ పన్ను ద్రు
చ్చులు ఊరేగు ప్రపంచమందు పశు ప
క్షుల్ వోలె పైపైని క
ప్పులు లేకుండ చరించు నగ్నతనులే
పూజ్యుల్ గదా! ఎంచగన్.

# హిమగిరీంద్రుడు రవీంద్రుడు

హిమగిరీంద్ర శిఖరి, హిందూ మహాంబుధి
గంగ, యమున, కృష్ణ కలవు మాకు
కలవు తూర్పు పడమరల కనుమలు మాకు
కవి రవీంద్ర! నీవు కలవు మాకు.

కలవు కాని నేడు కనరావు కనులకు
ఐన లేదు నీవు లేని చోటు
లోని కనులు విప్ప లోకమ్ము నిండార
కలవు నీవు, వెల్గ గలవు నీవు!

వంగమె కాదు, ఈ భరత
వర్షమె కాదు, ప్రపంచ మెల్ల ఉ
ప్పొంగెను నీయెడంద విర
బూచిన కావ్యకళా పరీమళో
త్తుంగ తరంగ డోలికల;
దుర్భర దాస్య విశీర్ణ సాహితీ
ప్రాంగణమందు నాటితి వ
యా విలసద్రసపారిజాతముల్!

శీతాద్రివై నీవు గీతాంజలి ఘటించి
ప్రకృతిలో లీనమై పాడు నపుడు,
విశ్వ భారతి వీణ వినిపించె నొక క్రొత్త
శ్రుతి, నవజీవన రుతి; రవీంద్ర!

దేశాల విడదీయు ద్వేషాగ్ని కుడ్యాలు
        కూలె, ప్రాక్పశ్చిమాల్ కూడి పాడె
ద్యోగంగ భూగంగతో కూడి ప్రవహించె
        నరునిలో దివ్యగంధములు వీచె
ప్రావృడంభోధర రథమ్ముపై నొకపుడు
పుష్ప సురభిళ వన మార్గమున నొకపుడు
స్వామి యేతెంచి, నీ హృది ప్రేమ హస్త
ముంచి, ఆనందజలధిలో ముంచె నిన్ను.

మంజుల భారతిన్ హృదయ
        మందిరమందున నిల్పి, దేవ భా
షం జెలువొందు నా ఉపని
        ష న్నవసారము పిండి, నీవు గీ
తాంజలి పట్టి నవ్వు హృద
        యాంజలి పట్టి జగజ్జనాళి భ
క్తిం జపియింపరే భరత
        దేశ యశోరవి విన్ లసత్కవీ!

సృష్టించితివి కవిస్రష్ట! 'గోరా'ను నీ
        దేశభక్తికి దివ్యదీప మట్లు?
ఒక అల్పఘటన మొక్కొక చరిత్రకు బీజ
        మిడు నని తెలుపు నీ 'పడవ మునక';

నీలోని స్వేచ్ఛా దయా లక్ష్మి ఉప్పొంగి
పారెను నీ 'ముక్తధార' లోన;
నాట్యాభినయ కళౌన్నత్యంబు చాటింప
గల్గె నీ "నర్తనకన్య పూజ";

అమృత హృదయ! నీకథలు సత్యములు చాటె
నీ పవిత్రగానమ్ము వెన్నెలలు గాచె
శ్రీ రవీంద్ర కవీంద్ర! నీ సిద్ధ వాగ్ద
నిత సరస్వతి విశ్వజనీన మయ్యె!

మంచుకొండను జూచి, మానసమ్మును పెంచి
అమృతధారగ పారినట్టి నీకు
ఎండకాలపు గుండె ఏ మేమి వాపోవు
చుండెనో వినిపించుచుండు నీకు
మెరపు ఖడ్గము లాగి చిరకాల దాస్య శృం
ఖలములు తెగవేయ గల్గు నీకు
బ్రతుకునేలను పండు లాభ ప్రమాదాలు
అనుభవించుచు ఋషి యైన నీకు
మన్ను దున్నెడి మనుజుల మధ్య ఎపుడు
దేవు డుంట గాంచిన గురుదేవ! నీకు
గురు వొకండు, బడి యొకండు ధరణి లేవు
ధాత్రి విరచిత ప్రకృతి పుస్తకము తప్ప!

నీజన గణ మన గానము
నీజాతికి గీత మయ్యె, నీ స్వప్నము స
ద్యోజాత సత్య మయ్యెను
మా జీవిత శరచ్చంద్రమా! కోకిలమా!

ఖండాంతరముల భారత
ఖండమున కఖండ కీర్తి గడియింప కవీ
ట్కాండమ్మన నీవె కవీం
ద్రుండ వనిరి లోకకవివరుల్ సత్యాత్మన్!

నీ గభీరానంత సుందర
తా గవేషణమున సుమించెను
ఆ యపూర్వామ్లాన తారు
ణ్యా మృ తోషా బాల ఊర్వశి!

నీదృఢోజ్జ్వల మానవత్వా
రాధనమ్మన విల్చె "శాంతి వి
కేత" నమ్మన విశ్వ భారతి
భూతలము వెల్గన్!

సరస సాహిత్య సంస్కృతీ స్నపిత మైన
ఆంధ్రజాతి విన్ గుండెల కద్దు కొనుచు,
నీ కళామందిరములను నిల్పుకొనును
అభ్యుదయ శాంతి శిఖర సమగ్రములను!

# మొల్ల కవితాశక్తి

మొల్లను గూర్చి నే కనులు
మోడ్చి స్మరించితి; కానుపించె ఓ
హల్లకపాణి, రమ్యరజి
తాక్షరవేణి, ప్రబుద్ధవాణి, తా
వల్లుచునుండె భక్తిరస
మౌక్తిక హారము; కాదు జానకీ
వల్లభు పుణ్యగాథ, ప్రణ
వ ప్రణయాత్మకథా ప్రబంధమున్.

పుబ్బనక్షత్రాన పుట్టిన మొల్లమ్మ
తల్లిని కోల్పోయి తల్లడిల్లె
తల్లియు తండ్రియు తానెయై కేసన
సెట్టి ఆపట్టిని చేసె పెంపు
శ్రీకంఠమల్లేశు సేవలో కైంకర్య
బద్ధయై బసవియై సిద్ధిపొందె
అలకృష్ణరాయల అష్టదిగ్గజముల
అభిమాన కవయిత్రి యయ్యె నామె

హర హర వరప్రసాదమహత్తు కలన
ఇహ పరానంద సత్య సాహిత్య సృష్టి
పలిపె నవరస భరిత దాశరధి చరిత
మొల్ల రామాయణముగ వర్థిల్లె జగతి.

"శ్రీమహిమాభిరాముడు, వ
సిష్ఠ మహాముని పూజితుండు, సు
త్రామవధూ కళాభరణ
రక్షకు డాశ్రితపోషకుండు శ్రీ
రాముడు" మొల్లమాంబకు వ
రంబిడి ఏమని ఆనతిచ్చెనో
ఆమె రచించె జీవితర
హస్య వృతానుభవేతిహాసమున్.

గంటము బూని ఆదికవి
కావ్య రుచిన్ మదిలోన నింపి, ము
క్కంటి శిరత్ సరత్ ధిషణ
గంగను ధారణచేసి మేటి తె
న్గింటి శుభాంగి, జ్ఞాన పర
మేశ్వరి మొల్ల రచించె ధారుణీ
కంటక రాక్షసత్వ దశ
కంఠ విలుంఠన రామగాథలన్!

ఇల రామాయణ మెందరో మగకవుల్
హృద్యంపు పద్యాలలో
పలురీతుల్ పలుదేశభాషలను సం
భావించి చిత్రించినన్

లలనా దృక్పథమందు లేదనుచు అ
ల్లల్లాడె శ్రీవాణి, కాం
తల హృద్వేదిని మొల్ల వ్రాసినది సీ
తా వల్లభాభ్యానమున్!

మగవారికన్న మగువలు
సుగుణమ్ములలోన రూపశోభలయందున్
తగు వా రను సత్యమ్మను
తెగచాటిన వీరనారి ధీమణి మొల్లే!

మగువను మందర చేసిన
మగవారికి బుద్ధి చెప్ప మందరపాత్రే
అగుపించని రామాయణ
నిగమము సృష్టించె మొల్ల నిర్మలదృష్టిన్!

పతులు వంచించగా ఉపపతుల కూడి
పతిత లౌచున్న సతుల దుస్థితుల తేట
తెల్ల మొనరించినట్టి ఆమొల్ల ఎరుగు
ధర్మ మేదియొ భువి పాపకర్మ మేదొ!

ఏనాడో తన కిత్తు నన్న వరముల్
ఇమ్మంచు కైకేయి కో
రెన్ నాథున్; రఘురామచంద్రుపయి వే
రే భావమో వైరమో

కావే కాదని విశ్వసించి చిర సం
　　స్కార ప్రబోధాత్మక
స్త్రీ నైజమ్ము్మను చాటు మొల్లకవయి
　　త్రిన్ ధాత్రి కీర్తించెదన్!

అలతి అలతి మాటలతో
సలలిత భావాలు శైలి సారళ్యముతో
మలచిన రామాయణమున
కలకాలము నిలుచు దివ్యకాంతులు నిండెన్

కులమత లింగ విభేదము లెంచని
　　కోకిల గానము తానై
కలుష సమాజ కిరాతక పీడిత
　　క్రౌంచ, విహంగము తానై
విలవిలలాడిన ధర్మ శతాంగపు
　　విజయ పతాకము తానై
వెలసెను మొల్లమ రామకథాగత
　　విప్లవభావము తానై!

శ్రీకార ఓంకార శిఖరాగ్రవాసిని
　　అక్షరానంద లాస్యాబ్జచరణ
శ్రీరామ శివనామ పారాయణ తపస్వి
　　సాహిత్య సంగీత సారసాక్షి

ఊరేది యైనను పేరేది యైనను
తీరాలు లేని సుధీవిశాల
దివికి చేరిన తల్లి భువిని వెలిగిన తండ్రి
దీవనల్ బడసిన పావన ధుని
మొల్ల నవరసభావ సంపుల్ల వదన
మాటలాడిన ముద్దులమూట లయ్యె
పాట లల్లిన నెత్తావి తోటలయ్యె
పద్యధారలు ప్రగతికి బాటలయ్యె!

# ప్రణయానుభూతి

ఆమె నడచిన నేల రాగారుణాబ్జ
సరసిగా మారె, నా భావసౌరభాలు
పదపదముమీద లిఖియించె ప్రణయకృతులు
అమృత వృత పర్వ గర్వ స్వర్ణాక్షరాల.

నింగి నేలల కలిపెడి సింగిణివలె
వచ్చి నిలిచెను నను కోరి వచ్చినటుల
వలపు వర్షించి పోయిన వాటిలోన
బ్రతుకు కనిపించి పోయిన బాటలోన!

గీతము నే నైతే సం
గీతము తా నైనయటుల కేల్మోడ్చి మనః
ప్రీతి యొనర్చెడి, శుభ సం
కేత మిడెన్ నేను చలితకేతన మైతిన్!

కనులార చూచి ఆకమలాక్షి సొగసును
రమ్మంటి నాకుటీరమ్ములోకి
అడుగులో అడుగిడి అరుదెంచు రమణిని
నిలువెల్ల చేతులు నిమిరె నపుడు
వచ్చి కూర్చున్న ఆ వాల్గంటి కెమ్మోవి
చవిని నా వాలుక సాచి చూచె
అద నిదే యని ఆమె వదన గంధము పీల్చి
కరిగెను నా నాసికాపుటములు

ఎట్టకేలకు మురిపము పట్టలేక
కిలకిలా నవ్వు ఆచెలికేకలు విని
కర్ణములు తేలియాడె నాదార్ణవమున
పరవశించె పంచేంద్రియ ప్రకృతి సుకృతి.

రేయిబవళ్లు నే నొక క
　　　శీన విహీన హయమ్ముపోలె, ఏ
ధ్యేయము లేకయే విపిన
　　　దేశములన్ విహరించుచుంట, అ
న్యాయ మటంచు నాగుణగ
　　　ణమ్ము లెరింగిన మాధవుండె ఈ
ప్రేయసి నంపినాడొ మర
　　　లించగ నన్ రసరాగసీమకున్!

అనుకొనుచు ఆ ప్రియాంగన
కనుగవ విరజిమ్ముకాంతి కలయో నిజమో
అనుకొనుచుండగ, నవజీ
వనవతి, రాగపతి; ఘోషవతియై పలికెన్.

ప్రేమించు ప్రియతమా ప్రేమించు నన్నంచు
　　　నవనవాంగన కొంటెనవ్వు నవ్వె
పంచేంద్రియాల నీ ప్రణయామృతమ్ములో
　　　ముంచుమా యంచు బోధించె సఖియ

తనమేను, తనబుద్ధి, తన మనోవాంఛల
కరిగించు మనెను నాకలతలన్ని
తన జీవితమునే, అతను రాగ పాత్రగా
ఎంచు కొమ్మంచు ఊరించె నన్ను
కాలగతులను నీ నీలి కనుల మోడ్చి
ఆకసము వైపు నీ ప్రధానాంగ మెత్తి
కాముకత త్రాగు నాకాయకలశమందు
నింపి పెట్టిన ద్రాక్షపానీయ మనెను!

స్వప్నముల మాయలో చిక్కి భంగపడిన
కళ్లలోనికి వాస్తవ కాంతి వగుచు
వచ్చి నా జీర్ణ శైశిర వాసమందు
నవవసంతము నాటెద వెవరు నీవు!

గడియలోనవె నీ ప్రేమ గంధములతొ
వేలవేల వసంతాలు విరిసినట్టి
వర్ణనాతీత కిర్మీర వర్ణ జీవి
తేప్ప లందించుచుంటివి, ఎవరు నీవు?

అవ్యవస్థితావ్యక్త గాఢాంధకార
బంధుర మైన్మన నా మనోబ్రమ్ముల్లోన
సువ్యవస్థిత ప్రణయసంశోభితార్ద్ర
భవనమును కట్ట వెంచెద వెవరు నీవు?

కనుపించుచు ప్రశ్నవలెన్
విని విని నాప్రశ్నలన్ని వింతగ ఏదో
కని విని ఎరుగుని సత్యము
అనుభవమైనట్లు ఆమె అభిభాషించెన్.

వేయవచ్చును ప్రశ్నలు వేనవేలు
బదులు చెప్పెడి వారివే బాధలన్ని
చదువుకొనువారు ఏదైన చదువవచ్చు
వ్రాయు వారివె చింతలు వంతలన్ని!

ఎందుకీ ప్రశ్నలన్ని నిస్పందియముగ
వ్యాఖ్య లక్కరలేని అలేఖ్య కృతి వి
భూతిలో వ్యంజిత యుగళ గీతమందు
కలిసికొన్నట్టి చెదరిన కలలు మనము!

నరులమో సురవరులమో ఎరుగలేక
అదుగొ చూడుము ఈ సుందరార్ధరాత్రి
నవ్వుచున్నది యన - దేవి నగవు లనెను
"నీవు నేను కా దెవరమో, నేను-నీవు".

బిగువు కౌగిట నన్ను ప్రియమార సంధించి
విడువు మానందాల వేల వైపు
స్పందితోష్ఠ్యముల నన్ శంఖమ్ముగా ఒత్తి
పూరించు పృథ్వి మార్మోగునట్లు

చకితహస్తాల నన్ చక్రమ్ముగా త్రిప్పి
విసురము చేరగా రసజగాలు
ఆడించు నాదు సర్వాంగాస్త్ర శస్త్రాలు
శృంగార ధర్మాజిరంగ మందు
కోరి ఏమైన నను చేసికొనుము గాని
ఇష్టకామ్య సిద్ధికి నియోగించుకొనుము
పరవశించెడి హృదయకూపమ్మునుండి
చేదుకొని పంచప్రాణాలు, ఆదుకొనుము!

అస్తినాస్తిత్వ సంగమ మైన నీదు
కటితటాంచలరేఖపై కలికి! నాదు
ఆత్మలింగ ప్రతిష్ఠకై అనుమతిమ్ము!
నాహృషీకేశ మస్తకాననము వంచి.

ముక్తికై రక్తి విడనాడి, పూనినట్టి
నా భ్రమాభ్రమర భ్రమణమ్ము నింక
విరమణము చేసి నీతనూ వీణలోని
పంచమశ్రుతులందు రమించ నిమ్ము!

మర్మగర్భితమైన నీమంద హాస
చకచకలతోడ నీ కనీనికలతోడ
నావిశీర్ణతమఃపూర్ణ భావ సీమ
నింపుకొననిమ్ము, నిన్ను సాధింపనిమ్ము!

నీల గగన గోప్తనీరసమ్ముమను త్రాగి
వచ్చి, పాత స్మృతులు వదలి వేసి
కాలభోగి కనని కాంతులు కనెడి నీ
కనుల చుట్టు నేను కాటుకౌదు!

చోద్యమౌ త్వదీయ చుబుకంబు పట్టుక
అద్దమంటి నీదు ఆననమున
చూచుకొంటి ఎపుడు చూడని నామోము
దిక్కు తెలియ, నాకు దిక్కు నీవె!

కనులతో కనుల్ కలిపి ముఖాముఖిగను
చూపు నిల్పినచో కను పాపలందు
వ్రాసియున్నది చదువగా వచ్చు; మనము
నిరుపమానులు కుపమాననీయుల మని.

ఇరువుర మప్పుడు ద్విత్వా
క్షర రూపాలింగనమున శయనించగ, శా
ర్వరియే కప్పెను జ్యోత్స్నాం
బరమును; వీచెను సమీర వరవీవనలన్

"రసరూపిణివి నీవు రసికాత్ముడను నేను
గోప్యమ్ము లేనట్టి గుట్టు మనది
నామమాత్ర రుజాజరా మరణాలకు
చిక్కని సంయోగ సిద్ధి మనది

అద్వైత అద్వితీయానంద కేళిలో
సత్యసాంగత్య ప్రశాంతి మనది
ఆత్మశరీరాల ఆంతర వైరుధ్య
బాధ లేనట్టి సుబోధ మనది
పాతబడనట్టిదియు తీసివేత లేని
నగ్నతను ధరించిన జీవనదులు మనము
అనెడి వారెవ్వరో తెలియనట్టి వాణి
వింటి నిర్వ్యరమును మేలుకొంటి మపుడు.

# దువ్వూరిద్యుమణి

స్వాభిమానము; ఆత్మవిశ్వాసదీప్తి
సూర్యచంద్రులు నీదు యశోవిశాల
సాహితీలోకమునకు; రసానుభూతి
వాహినులు అయ్యె నీనవ్యభావవృష్టి!

నెల్లూరు మండలమ్మున
పల్లియ చిరునవ్వులోన ప్రభవించియు సం
ఫుల్లాత్మ చేతనత వ
ర్ధిల్లిన దువ్వూరి రామిరెడ్డి కవీంద్రా!

విలవిలలాడిన విలువలు రక్షింప
ప్రజ్ఞాన గిరులెత్తి పట్టినావు
సత్యబంధవిముక్తి సల్ప చీకటిమీద
కావ్యాల వారధి కట్టినావు
అసురత్వ ఘాతధర్మాగమ ప్రహ్లాదు
విజయగర్జకు శ్రుతి వెట్టినావు
సుఖదుఃఖ చక్ర సంక్షుభిత జీవాత్మకు
నిజబోధిసత్వము నేర్పినావు
ప్రకృతి లోలోని మానవ ప్రకృతిలోని
తత్వములసారమే నీ సుధామయోక్తి
పూర్ణవిజ్ఞాన కవితా ప్రబోధమయ్యె
ఖండ కావ్యకథాకావ్య భాండమయ్యె.

ఏబది రెండు వత్సరము
లే భువిలోన వసించి జీవితా
హోబిల మార్మికాక్షర ర
హోరసతత్వ మెరింగినావు, మే
ధాబలశాలివై పరమ
దార్శని కాభ్యుదయాను భూత్యుప
జ్ఞా బుధశాలి కోకిలమవై
ఋషివై అభిరామిరెడ్డివై!

అన్నా! నీకవితా కళా హృదయ భా
వావేశమున్ చూపగా
ఎన్నో భాషలు నేర్చినావు నవ సా
హిత్య ప్రపంచంబులో,
కన్నీటిన్ భరియించి నీ తెలుగు మా
గాణాల విజ్ఞాన సం
పన్నంబైన అపూర్వ కావ్య నిధులన్
పండించినావో కవీ!

కవితలు చూచి మాన్య కవి
కాండము గుండెల కద్దుకోగ నీ
నవరస పూర్ణ చిత్ర రచ
వన్ గని పొంగె కళామతల్లియున్

అవిరళ సాహితీ కృషికి
అంకితమైన త్వదీయ జీవితా
ర్ణవమున తేలియాడె రస
రాణి భవాని వివేక వాణియున్.

ఒక్క మధు పాత్ర చేబూని చక్కనైన
చుక్క సాకీని కనులార చూచుకొనుచు
ఉమరఖయ్యాము పాడిన అమరగీతి
మానవునికి జీవనతత్వ "పానశాల".

వన్నెచిన్నెల పారసీ వనములందు
కైపుతో పాడు ఖయ్యాము కైతలకును
తేనెలొలికెడు నీతేట తెనుగు త్రాపి
చోద్యముగ పదపదమ్మున చూపినావు
కొత్త కొత్త గమత్తుల మత్తులెన్నొ!

వాదవివాద దూరగుణ
వర్ధకమౌ ప్రతిభామృతమ్ములో
వేదములయ్యె మూలమును
వీడని నీ అనువాదముల్, రసా
స్వాదవలోను తాత్విక వి
చారణ లోమ అనన్య సాధ్యమౌ
వీదగు "పానశాల" కృతి
నీకు; ఖయామునకు నిండు కీర్తియౌ.

# నేతాజీ ఆత్మగతం

*(నేతాజీ సుభాసుచంద్రబోసు మరణం ధృవీకరించబడలేదని సుప్రీంకోర్టు అతని కిచ్చిన మరణానంతర భారతరత్న బిరుదును ఉపసంహరించిన సందర్భంలో)*

చచ్చితినంచు కొందరును
 చావగలేదని కొంద రెప్పుడో
వచ్చు నటంచు కొంద; రెటు
 వచ్చును చచ్చిన నంచు ఊహకున్
వచ్చిన రీతి ఎవ్వరికి
 వారు తలంతురు; నాకు అందరున్
నచ్చినవారె యౌట, పడి
 నాను విచిత్ర వివాదనీరధిన్.

చచ్చితినా లేదా, నేనే
ఖచ్చితముగ చెప్పలేను, కడలి కడుపులో
చొచ్చిన సూర్యుడు చచ్చునె?
చచ్చునె తమసాబ్ధి మునుగు చంద్రుడు చెపుమా!

చచ్చితి నందునా స్వాతంత్ర్యవీర జీ
 వన భావనలలోన బ్రతికియుంటి
బ్రతికితి నందునా పారతంత్ర్యము పీల్చు
 పచ్చినెత్తుట పడి చచ్చియుంటి

చచ్చితి నందునా స్వారాజ్యలక్ష్మి భా
రత సాధకుద్యాల బ్రతికి యుంటి
బ్రతికితి నందు నా స్వార్థ సంకుచితదం
ష్ట్రల చిక్కి ముక్క లై చచ్చియుంటి
చచ్చితినె, లేదు బ్రతికిన జాడగలదు
బ్రతికితినె లేదు చచ్చిన వార్త గలదు
బ్రతికి చచ్చిన వీర సుభాసు నేను
చచ్చి బ్రతికిన జీవనాశయము నేను.

ఎవరికి చెప్పకుండ భర
తేందిర బంధ విమోచనార్థమై
అవలికి పోయినాను, అసు
రాయుధశక్తి నహింసతో జయిం
చవశము కాదు కాదని స
శస్త్రుడనై భరతోర్వి శత్రుశ
త్రువులను కూడినాను, జయ
తోరణముల్ రణమందు కట్టితిన్.

శోకతిమిరము తొలగించు జ్యోతికొరకు
వదలినటు బుద్ధుడు కపిలవస్తు పురము
దాటిపోయితి దాస్య కవాటములను
తిరిగి రానెంచి స్వాతంత్ర్య తరణితోడ.

తమ మాటల్ వినినాడ కాదని - అస
త్యమ్మెమొ సత్యాన, ద్వే
షమునో రాగముతోడ గెల్చుట కహిం
సా శాంతి మార్గానవే
తమ వెంటన్ చనినాడ కాదని - మహా
త్మాగాంధి నెహ్రూజి స్వాం
తములం దెంతయు కుందియున్ అవరె నే
తాజీ భలే యంచునన్!

పారతంత్ర్య తమిని పౌరుష ఖడ్గధా
రారుణ ప్రభల చెండాడునట్టి
ఉన్మత్త మత్త మహోగ్ర సామ్రాజ్యవా
దాసురమకుట మడంచునట్టి
కులమత జాతి సంకుచితత్వ దుర్గాల
చీల్చి మానవుని రక్షించునట్టి
మలయా హిమాలయ వలయాన గ్రుంకబో
వన్న సూర్యుని చెరగొన్నయట్టి
దేశభక్త్యుష్ణరక్త ప్రవాన భార
తీయ రణవీణ ఆజాదు హిందుసేన,
నాటె తొలిసారి ప్రాగ్దిశా వాటిలో త్రి
వర్ణకేతన వల్లి గర్వాల వెల్లి!

స్వాతంత్ర్యసమరాన సాగిపోవుటతప్ప
　　స్వార్థచింతనము, విశ్రాంతి లేని
ఆదర్శసిద్ధికై త్యాగధనము తప్ప
　　దుష్టార్జిత ధననిధులవి లేని
జైహిందు జైజై విజయ గర్జనలు తప్ప
　　అంతఃకలహాభవుభవులు లేని
ఆగ్రహ సత్యాగ్రహాస్త్ర ధారులు తప్ప
　　పనికి మాలిన పిర్కిపందలేని
రోజులవి జీవితాలె కర్పూరమట్లు
కరిగి, గిరివిభదాస్య పంకమును కడిగి
వేయు ఆ రోజులు స్మరించు నా యెదంద
పొంగిపోవు హిమాలయ శృంగమట్లు.

స్వాతంత్ర్యోదయమయ్యె భారత జన
　　స్వప్నాలు పండెన్, అహో
నేతాజీ కనరాడ దేమి? తన సం
　　దేశమ్ము విన్పింప డే
లా? తారాపథ చుంబి కీర్తిమయుడే
　　లా? చంద్రు డేలా?.జగ
న్మాతృ శ్రీనయనోత్పలమ్ములకు ఆ
　　నందమ్ము కల్పింపడో?

అని, జనవాణి ప్రియమ్మున
నను తలచి నుతించె, లోకనాకములొక్కటై
నను ముంచెను తాదాత్మ్య
మ్మున జీవన్మరణ రహిత మోక్ష స్థితిలో.

బాపూజీ బలియయ్యె దుర్మతతమో
వ్యాళోగ్రవాహాగ్నికిన్,
ఆపై దీపము ఆరిపోయినటు స
ర్దారుండు కన్మూసె, ఇం
కాపై రాలె ననేకతారకలు జ
హ్వార్లాలు, శాస్త్రిజి, దు
ష్ప్రాపత్య క్షతగాత్రు లైరి భరత
క్ష్మామాత దౌర్భాగ్యమో!

మనుషులు మహాత్ము లెందరు మరుగు పడిన
మరుగు పడరాదు స్వాతంత్ర్య తరణి దీప్తి
చితికిపోరాదు ఏ పరిస్థితుల నైన
మీమనోగత మానవతామతల్లి.

# భానుడే భగవానుడు

సృష్టికి మూలము సూర్యుడు
దృష్టికి మూలమ్ము సవిత దీధితి కానన్
స్రష్టాకృతి పరమేష్టికి
సాష్టాంగ నమస్కరోమి, సత్యస్ఫూర్తిన్!

అంతము లేని ఆకసము
నం దెటనో ఉపవిష్టు డై, అయ
స్కాంతమనస్కతన్ నిఖిల
సౌరకుటుంబము నాదరించుచున్
కాంతిని ధ్వాంతమున్ కరయు
గమ్మున త్రిప్పుచు దేశకాల వి
భ్రాంత విచిత్ర రూపకము
వ్రాసెడి భానుని కంజలించెదన్!

తననే తాను జ్వలించుకొంచు పరమా
ర్థమ్మేను లక్ష్యమ్ముగా
జనకోటిన్ పశుపక్షి వృక్ష తతులన్
సంప్రీతి పోషింపగా
అనునిత్యమ్ము అకాండతాండవ దృశో
ష్ణాభా సుధాధారలన్
ప్రణవాత్మన్ కురిపించు ద్యోమణిని, సం
భావించి కీర్తించెదన్!

ఇనుని రథము లాగు ఏడుగుర్రాలేమొ
వారపు దినముల పేరులంట
పన్నెండు జతల ఇర్వదినాల్గు చక్రాలు
వత్సరంపు నెలలు, పక్షములట
ఆరథాంగములోని ఆకులు ఎనిమిది
ప్రతి దినమున అష్ట ప్రహరములట
శ్రీహరిచక్రము, శివుని త్రిశూలము
భాస్కరుతనుదీప్తి భాగములట
సూర్యమహిమా ప్రథితపరంజ్యోతిగూర్చి
గాథలను, బోధలను, సమారాధనములు
తెలిసికొనుచున్న నా కనుల్ తెరచు కొనగ
భానుడే కానుపడు భగవానుడట్లు!

ఏనాడో రసరంజనార్కు డిల తా
నేలోకమం దెన్నడున్
కానంగల్గని మోహనాంగి, జలధిన్
కన్విందుగా లీలగా
స్నానం బాడుట చూచి చేరువగ కా
వన్ తేరు మళ్లించుచో
కోనన్ జారిపడెన్ శిలాలయముగా;
కోనార్కు సేవించెదన్!

వేదాలు కొనియాడె ఆదిత్యు నేనాడొ
　　　అగస్త్యు డెరిగించె అతని హృదిని
'మార్తాండుడేను త్రిమూర్తిత్వరూపుడు'
　　　అనుచు ఘోషించె గీతామృతాబ్ధి
ఆయురారోగ్య భాగ్యదుడు భాస్కరుడని
　　　ఋజువు చేసెను మయూరుడను ఋషియు
గాయత్రి మంత్రగానాయత్తమౌ రవి
　　　చేతనమ్మే జీవ చేతనమ్ము
సకల విజ్ఞాన శాస్త్రముల్ ప్రకృతి శాస్త్ర
పాఠములు సూర్యదేవుని ప్రాభవమును
తలచి కొలిచెడి సరిక్రొత్త దర్శనములె
అన్ని శక్తుల నిధి కమలాప్తుడేను!

నాదబ్రహ్మము ఛంద, మక్షరములౌ
　　　నక్షత్రముల్, వేదముల్
పాదమ్ముల్, గ్రహముల్ ఉపగ్రహములే
　　　ప్రాసల్ యతుల్, మానవ
ద్యో దౌత్యాశయ దివ్యదిగ్విజయ సం
　　　దోహమ్ములే శైలియౌ,
ఆదిత్యాంశువులేను భావములు నా
　　　ఆత్మార్ద్ర కావ్యాల కున్.

# సుగుణాల సుబ్బిరెడ్డి

సత్తరామేశ్వర నారికేళవనాల
రైతు బిడ్డడుకట్టె రాజమహాలు
లండను పెనుమత్ర మండలమ్ముల మధ్య
త్యాగశీలత స్నేహ ధారవోసె
పెద్దపెద్దబడుల విద్దెలు నేర్పని
బాలుడే కట్టె విద్యాలయాలు
భారతీయుల దేశభక్తికి శక్తికి
తెలుగువా డాదర్శ తీర్థ మయ్యె
తాను పుట్టిన మట్టి నౌదల ధరించి
కష్టనష్టాల కలి పరీక్షల భరించి
అతుల రామేశ్వరుని ప్రజాహిత సుమాల
రేయిపవలు కొల్చెడి సుబ్బిరెడ్డి అతడు.

బాల్యమ్ములో తోటిబాలురకు మిత్రుడై
ఆటలేతప్ప కోట్లాడలేదు
యౌవనోదయమున ఆదర్శమూర్తియై
ఇచ్చుటే తప్ప అర్థించలేదు
రామేశ్వరము వీడి రంగూను వెళ్ళినా
తన ఇంటి మర్యాద తప్పలేదు
రంగూనునుండి ఇంగ్లాండుకు చేరినా
మన జాతి సంస్కృతి మరువలేదు

ఒక్కడే కాదు ఎదవిప్పి లెక్కలేని
పేద బిక్కుల తనవెంట బెట్టుకొనుచు
కలిమి సీమకు చేర్చిన కర్మయోగి
సృజనతో కష్టముల జయించిన ప్రయోగి
చెలిమితో బలిమిని సహించిన విరాగి!

అచ్చతెలుగుబిడ్డ అచ్చమాంబను పెళ్లి
యాడిన భారతీయాత్మ డతడు
తొలిచూలిని ఎడద తొట్టిలో ఊపుచు
"వెంకన్న" యనిన సాత్త్వికు డతండు
మలిచూలి తన ఇంట వెలియగానే "రామ
కృష్ణ"యటన్న సత్కీర్తి పరుడు
పాప లిద్దరిని సంభావించె లీలావ
తీయంచు నాగేశ్వరీ యటంచు

ఎచట ఉన్నను భాగ్యాలవెన్ని వున్న
కన్నతల్లిని కీర్తించు కావ్య మతడు
ఎపుడు చిత్తాన నత్త రామేశ్వరుండు
వెలుగుచుండెడి కొత్త కోవెల యతండు.

ప్రెస్టనులో కాలుపెట్టినప్పటినుండి
సుబ్బిరె డ్డావూరి చుట్టమయ్యె!
ఆంధ్ర సంఘమున సభ్యత్వ మొందినాడె
యూ.కే.కు సజ్జనయోగ మబ్బె
చిన్న వ్యాపారము చేపట్టినప్పుడే
పెద్దపెద్దలమెప్పు పేరుపొందె

ఇండియాయే తన గుండె యని తెలుగు
ప్రజలపాలిటి త్యాగరాజు అయ్యె
కానుపడు నాత డొక్క అక్షరమువోలె
కాని శివసత్యసుందరాకారు డతడు
ఊరుపేరొక్కటైన శ్రీకార మతడు
భారతికి ఇష్టమైనట్టి భాష యతడు.

ఆశయముల లోన ఆలోచనలలోన
స్వార్థపరత లేని పరుల మేలె
దీపమట్లు వెలుగు త్రికరణ శుద్ధులు
అబ్బినట్టి బ్రతుకు సుబ్బిరెడ్డి.

నా కమనీయ భావరస
నందనవాటిక "పంచబాణసం
చా" కృతి అంకిత మ్మిడితి
చంద్రునికిన్ ఒక నూలుపోగునా
లౌకిక మైన స్నేహము అ
లౌకికమై అలరించె మమ్ము, ఇ
ట్లే కొనసాగగా వలయు
హృచ్ఛయ బంధము జన్మ జన్మకున్

అభినందింతును ఆతని
శుభ సంకల్పముల విజయశోభకు గావన్
అభిలాషిస్తా నాతని
కభయత మృత్యుంజయత్వమబ్బాలనియున్.

# హృచ్ఛయ బంధము

ఎక్కడిదాన వీవు, మరి
　　యెక్కడి వాడను నేను, ఎట్టులా
చక్కని సంజ వేళ ధ్రువ
　　సాగర తీరము మీద ఎందుకో
చుక్కల వోలె రాలిపడి
　　చూచితి మొక్కర నొక్క; రూహకున్
చిక్కని స్నేహ బంధమున
　　చిక్కితి మొక్క క్షణమ్ములోననే!

దాహము తీరెనా ఎదకు
　　తన్వి! భవద్రస వాక్కులందు; సం
దేహము తీరె నాత్మకు ప్ర
　　దీప్త భవన్ముఖహాసరేఖలన్;
మోహము లేని స్వచ్ఛ తమ
　　మోదము కూర్చు నిసర్గ రంజక
స్నేహము మించు భాగ్యనిధి
　　సృష్టిని లే దనిపించె నయ్యెడన్.

ఒకరిని చూడగానె ఎది
　　యో అమరాగము మోసులెత్తు, వే
రొకరిని చూచి చూడగనె
　　ఓర్వమి ద్వేషము పొంగులెత్తు, దే

నికి గల కారణమ్ము రమ
ణీ! కనరాదు వితర్కహేతు వా
దికి; మరి జన్మ జన్మలకు
తీరని వాసన లుండ కుండునా!

నా దేశ మీవంక నీదేశ మావంక
నడుమ నున్నవి మహా జడధు లేడు
నా మతమ్మునకు నీదౌ మతమ్మునకును
వయసు భేదము వేల వత్సరాలు
కుల మున్న దను నాకు కులము లేదను నీకు
నడుమ అగాధ వర్ణ వ్యవస్థ
నా రంగు నా రూపు నీ రంగు నీ రూపు
వెలుగు చీకటు లట్లు వేరు వేరు
ఇంత అంతర మున్న రవంత యైన
అడ్డు లేదయ్యె ఆత్మసమైక్యమునకు
లౌకిక స్వార్థచింతనానేక బాహ్య
బంధనా లేల మన స్నేహబంధమునకు?

పాదు పంది రేని లేక పారు తీవ లట్లులన్
ఆది అంత మేది లేని అంబుదాల పోలికన్
రోదసీ హ్యాందంతరాలలోని తార లట్టులన్
నాదమట్లు వేదమట్లు నాదు నీదు స్నేహమౌ

పాడితి వీవు, నా ప్రణయ
పల్లవ బాహురసాల శాఖలన్
వీడక నిన్ను పట్టుకొన;
వేల అకాల వసంత మాధురుల్
పాడెను; శీతవాతములు
భగ్గున మండెను; ఆ దినమ్ము నే
నాడు స్మరించుకొన్న స్మృతి
నాళము మ్రోగును శబ్దపేటియై!

నీవు పాడియు పాడించినావు నన్ను
నీవు ఆడియు ఆడించినావు నన్ను
భావములు నావి పాటలో భాష నీది
ప్రేరణము నాది నాట్యాల రీతి నీది.

వచ్చి పోవవచ్చు ప్రభువులు ప్రభుతలు
కాని - నిల్చి పోవుగా చరిత్ర
చచ్చిపోవవచ్చు సశరీర ప్రేమికుల్
చచ్చి పోదు ప్రేమ శాశ్వతమ్ము.

# బమ్మెర కోకిల

బమ్మెర కొమ్మపై తెలుగు
భాగవతామృత కోకిలమ్మవై
చిమ్మిన భక్తి భావరుతి
శీకర శ్రీకర హృద్య పద్య రా
గమ్ములు కూర్చె పంచశతి
కాలము తాళమువేయ ఆంధ్ర దే
శమ్మున కాంధ్ర సాహితికి
శాశ్వత హేమ వసంత శోభలన్.

పలికినది భాగవత మని
పలికిన పలికితివి గాని పలికిన దెల్లన్
పలికినది మానవతమై
పలికిరి ముగురమ్మ లొక్క పలుకై నీవై.

సత్యాన్వేషణ నిత్యకృత్యముగ హిం
సా కంప విధ్వంసకున్
దైత్యారిన్ హరి నచ్యుతున్ కొలుచుటే
ధర్మమ్ముగా నెంచి, సా
హిత్య క్షీర సముద్రమున్ తరచి సా
హిత్యామృతం బిచ్చి స్వా
ర్థత్యాగ ప్రణవ ప్రబోధవధన
ప్రహ్లాది వైనా వాహో!

తత్వ మసి కన్న మించిన
తత్వము వేరొకటి లేదు తత్వ జగన్నే
తృత్వము నీ సుకవిత్వ ర
సత్వము నెలకొల్పె పరవశత్వముతోడన్.

ఒక బక్క రైతువై ఒక మహారాజునే
ధిక్కరించిన కళాధిపుడ వీవు
అందరి నోదార్చు అక్షరవాణినే
ఓదార్చినట్టి భావుకుడ వీవు
హలమైన కలమైన అఖిల జనానంద
సాధనమే నన్న సమత వీవు
భోగివీ భోగ ప్రబోధాత్మలో నుండి
త్యాగివై మ్రోగిన యోగి వీవు

దారసుతులను సహజ సంసార పథము
బంధు మిత్రులు సాంఘిక బాధ్యతలను
వీడకయె మానవత్వము వీడకుండ
మనిషి దేవుడు ఒకటైన మహిమ వీవు.

కావ్యకన్యల కూళల కమ్మ రాద
టన్న నీవాక్కు లోక కల్యాణ బుక్కు
కూటికోసము అమ్మరా దోటు హక్కు
అను ప్రజాస్వామ్య సందేశ మయ్యె నేడు.

చలివేంద్రమ్ము కళాత్మ తృష్ణకు సహా
　　ప్రస్తంభ రామప్ప శై
వల సంప్రోజ్జ్వల శిల్ప కల్పనము; జీ
　　వజ్జీవ దేహాత్మనై
ర్మల కేంద్రమ్ము త్వదీయ భావసుషమా
　　రామమ్ము; తత్కాకతీ
యుల సామ్రాజ్యరమా విభూతికిని నీ
　　ఉద్యాణికిన్ మ్రొక్కెదన్.

# కావ్యాంకిత సంస్కృతి

ఒక మంచి శబ్దమ్మునకె, ఈల పాటకే
　　పొంగారు నీ అంతరంగమునకు
ఒక రమ్య భావమ్మునకె, రసవాక్కుకే
　　తీగలు సాగు నీ రాగమునకు
ఒక హృద్య పద్యమ్మునకె, వర్ణనముకే
　　సంతుష్టి నొందు నీ సహృదయతకు
ఒక భవ్య కావ్యమ్మునకె, నవ్య ఫణితికే
　　పరవశ మొందు నీ బాలమతికి
నా బ్రతుకు తోటలో వసంతాల లోన
విరియ బూచిన వేవేల సురభిళేద్ధ
శబ్ద, భావ, పద్యముల మంజరుల, కావ్య
సంపదల నిత్తు కృష్ణమాచార్య! కొనుము!

మనసిచ్చి నీతోడ మాటాడువా రున్న
　　ఎరుగ వాకలి, దప్పి ఎరుగ వీవు
స్వార్థమ్ములేని నేస్తమ్ముల పొందులో
　　ఎంచ వాపద, నష్ట మెంచ వీవు
తమలమ్ము, ఆటపత్రమ్ములు ఉండెనా
　　కోటి సంపద లైన కోర వీవు
సరస వినోదమ్ము, శాస్త్ర విజ్ఞానమ్ము
　　లేనిచో జీవించలేవు నీవు

కలిసి నవ్వుచు నవ్వించ గలవు నీవు
స్నేహమే తప్ప వైరము చేయ వీవు
అట్టి నీకన్న నా కవితాత్మ పొందు
దిట్ట ఎవ్వరు? నవరసరాట్టు ఎవరు?

మనము విశాఖపట్టణములో కలిసిన
నాడె ఆత్మలు పెంచి పాడినాము
భీముని పట్నపు బీచిపై పసిపిల్ల
లట్లు ఆటలు వాడు ఆడినాము
వెన్నెలరేలలో విపినవీధుల చింత
పల్లి కొండల కైత లల్లినాము
పోలీసుపనిమీద పోయి, నేరము వెన్క
దాగిన సత్యాలు తరచినాము.
వృత్తు లేవైనను మనఃప్రవృత్తు లందు
పథము లవి వేరెయైన దృక్పథములందు
ఒక్కటైనా ము; స్నేహ పయోధిలోన
కలిసి విహరింతమా కలకాల మిట్లె!

మోనిపై చిరునవ్వు మురళీరవము కన్న
మోహన మైన దామోదరుడవు
వీలి ముంగురులేను నెమలిపింఛము కన్న
మధురోజ్జ్వలమ్మైన మాధవుడవు
చేతిలో మధుపాత్ర శ్రీచక్రమున కన్న

చిద్విలాసము చిందు శ్రీధరుడవు
తరుణ భావాలె బృందావనమ్మున కన్న
అద్భుతావహ మైన అచ్యుతుడవు
పద్మనయనుడ వాజానుబాహుడవు, చ
రాచరానందకర వాక్సుధాకరుడవు
శారదా ప్రసన్నుడవు ఈ స్వాదు ఫలము
గైకొనుము కృష్ణమాచార్య! కావ్యరమను.

(నా తొలి పద్యకావ్య సంపుటి ఆత్మీయులు
కీ.శే. శ్రీ పి.వి.జి. కృష్ణమాచార్యులు, I.P.S., గారికి అంకితం చేసినప్పుడు)

# చాటువులు

## మధుశాపం

తీపి పదార్థముల్ తినిన తీరని హాని  కలుంగు నంచెదో
శాపము నాకు గల్గినది; శాస్త్రవిశారద వైద్యకోవిదుల్
బాపురె! ఈవిపత్తున కుపాయము లే దని రైన నేమి నా
తాపము తీరిపోయె లలనా మధురాధరపానసేవలో.

చక్కర తింటివో బ్రతుకు సొంతము మోడయి పోవునంచు ఏ
టక్కరి నన్ శపించెనొ మిఠాయిలు కాదు ఒకింత అన్నమున్
మెక్కగ నీయదయ్యె మధుమేహపిశాచము, ఐన నేమి నీ
చక్కరమోవి నా కఠిన శాపవిమోచన దైవ మయ్యెడిన్!

## అజ్ఞాన కోకిలలు

అజ్ఞాన ఖనులు బరిదెగి
విజ్ఞానము బోధ సేయు వింత జగతిలో
జిజ్ఞాస బ్రతుకుటెట్లు ఉ
పజ్ఞా కోకిలము గొంతు పలికేదెట్లో!

## ఈ రాయల కొల్వు!

వ్రాయుమటన్న కావ్యములు వ్రాయరు వ్రాతురు వారితొండముల్
చేయుమటన్న సత్కృతులు చేయరు చేతురు ఘోరఘీంకృతుల్
ఏయడవుల్ భరించని కవీంద్ర గజంబులు పంచరించు ఈ
రాయలకొల్వులో కటికరాళ్లు వినా ఎవ రుండ లేరులే!

## బీరు కొరకు

ఘోర భవ భయ భరితమౌ
ధారుణి స్వర్గమ్ము చేయ దక్షత గల జం
భారియని ఎరిగి భక్తక
బీరు కొరకు ఇంద్రుడేను పృథ్వికి వచ్చెన్.

## శాంతి ప్రియ

ప్రియమైనది విష్ణు ప్రియ
ప్రియము హరిప్రియ, ప్రియాతి ప్రియమైనది సు
ప్రియ; వారందరికిని ఇల
ప్రియమైనది శాంతిప్రియయె, ప్రియగుణవతియై!

## సమస్య

మారెను మారలేదు ఒక మందిరమేను మసీదుగా నటం
చూరక పోరు పడ్డ తనయుల్ భరతాంబ మనంబులోన చ
ల్లారని చిచ్చుపెట్ట; కను మన్నిట దేవుడు ఒక్కడే యనన్
శ్రీరహమాను ఇంట నరసింహముగా జనియించి క్రైస్తుయే!

## తెలుగువాడు

ధనమున్న చాలు సద్గుణముతో పనిలేదు
తెలుగువా డాతని తెగ పొగడును
అధికార మున్నచో అర్హులన్నిటికిని
ఆంధ్రు డాతనికి జోహారు లనును

ధనమధికారముల్ పెనవేసికొని యున్న
తెలుగువా డాతని దేవు డనును
ఈరెండు కలిగి రౌడీకూడ అయివున్న
ఆంధ్రు డాతడె పరమాత్మ డనును

తెలుగు గడ్డపై నేడు ఈ త్రిగుణ శీల
మున్నవానికి కొరత ఏమున్న దింక!
ఏ ప్రభుత్వము చట్టాలు ఏవియైన
సర్వవిధ భోగ భాగ్య గంధర్వు డతడు.

## ఏసీలు

సమ్మరులో చలి అంటే
నమ్మరు ఆనాడు, నేడు నమ్మించెద రా
రమ్మని పిలుచును ప్రతి వా
హమ్మున గల వాయుగతి నియంత్రణ యంత్రాల్!

## కరులు

కరులను, అరివీరభయం
కరులను, అను నిత్య శీతకరులైన సుధా
కరులను, స్థిరచిత్తదివా
కరులను, నరవరులను హితకరుల నుతింతున్!

## కవితాతత్వం

ఏది కవిత్వ హేషయొ మరేది నిశాచరఘోషయో గ్రహిం
చేదినముల్ గతించినవి; చేతల, కూతల వ్రాతలందు జ్ఞా
నోదయ దీప్తికంటెను వినోదనినాదపు గారడీలకే
మోదము చెందు వెర్రిజనముల్ మనశ్రోతలు పాఠకోత్తముల్.

బద్దత కనిబద్ధతకు, వి
రుద్ధము లే దమృత కావ్యరూపరచనలో
బుద్ధియు అనుభూతియును, ప్ర
బుద్ధ మ్మగు సంగమమ్మై పూర్ణకవిత యై!

గేయం రాసితి తొల్లిట
రాయాలని పద్య కవిత రాసితి సుస్వే
చ్ఛాయుత వచన కవిత్వం
హాయిగ రాసితిని ప్రక్రియాతీతుడనై!

## నొప్పులు

కంటి పంటి నొప్పి కడుపు నొప్పైనను
వచ్చిపోవు గాలి వాన వోలె
కరకరమని ఆస్థికల కొరికి తిను మో
కాళ్ల నొప్పి పోవు కాటిలోనె!

## మాయాదారి కాలం

నీమోవీ నామోవీ
ప్రేమానందంలో మూర్ఛిల్లిన గదిలో
ఈ మాయదారి కాలం
ఏమేమీ చేసిందో ఈశ్వరు డెరుగన్.

## సినారె

శ్రీరాజిల్లు సినారె ఆంధ్రకవితా శ్రీశైలశృంగ స్రవ
ద్ధారాపాత రసార్ణవోన్ముఖ వియద్గంగా వచో ధారుడై
పూరించెన్ శివసత్యసుందర జగద్బోధాత్మశంఖమ్ము స్వాం
తారామమ్ముల నిండ బ్రహ్మకళ పొంగారన్ ప్రజాకోటికిన్!

## అమెరికా వంటలు

వంటలు చేసిపెట్టుచును వాడిన పాత్రలు తోమిపెట్టుచున్
మంటలు లేని పొయ్యి పయి మాటికి మాటికి వేడి చేయుచున్
వంటకముల్ ప్రసన్నముగ వచ్చెడి పోయెడి వారి కిచ్చు తె
ల్గింటిసతుల్ భళే! అమెరికేశ్వరి కంటికి గర్వదీపముల్.

*(2-7-1989 నాడు హ్యూస్టన్ U.S.A. లో ఆశువుగా)*

**శారదహేల**

శారద సుమనస్త్తత్వవి
శారద నవభావరసరసజ్ఞత చాంద్రీ
శారద తారాపంక్తి ద్ప
శారద, నారాగ హృదయ శాంతిని కలచెన్!

**పురుషుల పరువు**

ధర కలదు పచ్చి వేశ్యకు
ధరలేదే విటులకెంత దండోళ్లైనన్
హరిహరులారా! మీ రిటు
పురుషుల పరువులను తీయబూనుట తగునా!

**అవధానం**

దత్తాత్రేయుడు అవధా
నోత్తము డనిపించె ధారయున్ ధారణయున్
చిత్తముల మత్తు గొలుప, గ
మ్మత్తులతో నిర్వహించె మాన్యులు మెచ్చన్.

**ప్రవాసాంధ్రులు**

హేమరహే మతులుగ,
ధామము పర్లాకమిడి సదా చైతన్యా
రామ విహారులు, సాహి
త్యామృతమును పంచు తెలుగుదనపు ప్రవాసుల్!

## భాగవతం

సుందరశైలికి హృదయ
స్పందనకర భావతతికి భాగవతమ్మే
మందిరము, అందు దశమ
స్కంధము బంగారు శిఖర సన్నిభమౌరా!

## గుండాలు

గుండా కంటికి మధురస
భాండమునా భామ కానుపట్టగ ఈ బ్ర
హ్మాండాధిపతిని నే నని
తాండవ మొనరించె కామతామసమతియై!

## ఆలుమగలు

పాదదఘ్నమైన బాధేమొ నీదైతె
కంఠదఘ్నమైన కలతనాది
ఆలుమగల మిపుడు ఆపాదమస్తకము
కలిమియందు కష్టకాలమందు!

## దత్తపది

ప్రజలు పడెడు పాట్లు పరమేశు డెరుగును
కోట్లు పెట్టి దొంగ ఓట్లు కొనెడి
స్వార్థపరులు ఎరుగజాలరు; "వాటరు
గేట్లు" తెరచు బందిపోట్లు వారు.
(పాట్లు, కోట్లు, ఓట్లు, గేట్లు)

**జీవియస్**

సాయిసుధార్చిత శ్రీరా
మాయణ పారాయణమున మత్తిల్లిన జీ
వీయస్ కోకిల పాడెను
వేయివంసంతాల తెలుగు వినని పదమ్ముల్.

**ప్రజానాయకుడు**

వానప్రస్థాశ్రమమున
ప్రాణేశ్వరిమీద ఆశపడి ఒక డాత్మ
జ్ఞానేశ్వరిని త్యజించి, ప్ర
జానాయకు డయ్యె మరల జంబూద్వీపే!

**పారసీ పరిమళం**

పూచెనా మొగ్గ, తిరిగి కాబోదు మొగ్గ
కాని ఒకసారి పూవు, మొగ్గయు నొకపుడు
గాను మారెడి నీతీయ కావి మోవి
కే ఘటింతును అంజలి ఏను సఖియ!
(ఒక పారసీక పద్య స్ఫూర్తితో)

**శ్రీరామవనవాసం**

ఆకుల్ రాలిన మ్రాకులే నడచి
త్యాగావేశతన్ వెళ్లున
ట్లే కాన్పించిన రామలక్ష్మణుల
పృథ్వీజాత సీతన్ కనన్

సాకేతప్రజలేను కాదు పశు ప
క్ష్యానీకమే కాదు, ఆ
కీకారణ్యము కూడ ఏడ్చినది
కైకేయీ దురంతానికిన్.

## భాష - భావం

భావము భాషపై తిరుగు
బాటొనరించును భాష యేమొ త
ద్భావములోన జీవము ర
వంతయు లేదని ఈసడించు, స్వా
భావికమైన రూపగుణ
బంధములన్ విడనాడి భాషయున్
భావము మృగ్యమై తెలుగు
వాఙ్మయ వీధులు తెల్లబోయెడిన్

# గిల్లింత పద్యాలు

(వ్యావహారిక భాషా పద్యాలు)

సంఘంలో జరిగే దు
ష్సంఘటనలమీద పద్యసాహిత్యంలో
లంఘించుటకై నా స
ర్వాంగాలకు నేర్పుతుంటి అతులిత ధైర్యమ్!

పరిపాలనలో జరిగే
పొరపాట్లన్నింటి నెత్తి పొడవాలని, నే
చురుకైన కలం పట్టా
సరిచేసే వాళ్ళు ఉంటె సంతోషిస్తా!

గణములు పోతే పోనీ
గుణములు చెదరని పదాలు గుప్పిస్తే ఏ
మనరట పండితులని ఈ
అనుదిన గిల్లింత కవిత ఆరంభించా.

అంతో ఇంతో తినకే
సంతకముల్ చేయువాళ్ల సంఖ్య గణిస్తే
ఎంతో ఉండదు, ఇకముం
దింతకు అధ్వాన్నమైతె ఏం చేస్తామో!

అవినీతిలేని చోటే
అవనీతలమందు ఎందు అగుపించ దనే
అవగాహన ఉన్నా, మన
కవగాహన కాదు భారతావని విషయమ్!

"నోటిస్తే ఓటిస్తా"
"మాటిస్తే తప్పననెడి" మంతనములలో
పాటించే నీతేమో
చాటిస్తే వేయి పద్యశాలువ లిస్తా!

నిత్యం సత్యం చెపితే
అత్యాచారాలు ఘోరహత్యలు జరిగే
దైత్యాధిపత్య దేశం
ముత్యం వలె చిట్లి మాడి బూడిద కాదా!

ఆఫీసుల్లో జరిగే
పాపాలకు అగ్గిపెట్టు పవనసుతుడు ఏ
రూపంలోనో జంబూ
ద్వీపానికి వచ్చినపుడె! దేవుడు సత్యమ్!

శుద్దులు, సిద్దులు, మేధా
బుద్దులు విలువైనవేను భువిలో, అయినవ్
బద్దత కలిగిన త్రికరణ
శుద్ధే లేకుంటె అన్ని శూన్యమ్మేరా!

తెలియక తప్పులు చేస్తే
తెలుపుట సాధ్యమ్ము; కాని తెలిసి తెలిసియే
తెలిసిన తప్పులు చేసే
తెలివికి తెలుపేది చావుదెబ్బ ఒకటియే!

చట్టం విలపిస్తోంది
పట్టపగలె తనను మానభంగం చేస్తే
పట్టించుకొన సంఘపు
పొట్టన తను ఖర్మకాలి పుట్టితి నంచున్!

నియమ నిబంధనలన్నీ
భయభక్తులు ఉన్న పేద ప్రజలకె కానీ
నయవంచనతో మనుషుల
క్రయ విక్రయములు జరిపెడి ఘనులకు కాదోయ్!

ఏపట్నంలో చూసిన
దావరికం వీడినట్టి దాదాగరి ఇ
ష్టా పరి పాలన మొనరిం
చేపర్వమెకానుపించు శ్రీరఘురామా!

వరకట్నం తేలేదని
కొరకొర వేధించబడ్డ కోడళ్లకు ఏ
ఉరితాడో, కిరసనాయులో
వరములు గా వచ్చి తీర్చు పరితాపాలన్

కుల నిర్మూలన మంటూ
కుల నిర్మాణాలు చేయు కుత్సిత మతులన్
నిలదీసి కూల్చు మేధా
వులు అంబేద్కరులు మళ్లి పుట్టేదెపుడో?

మాటల దిగమింగుతు, ఆ
ర్భాటంగా చిందులేయు రక్కసి సినిమా
పాటల అరుపుల ధాటికి
తూటులు పడె శ్రోతల చెవి తూటములకటా!

ఇద్దరికంటే హెచ్చుగ
వద్దర్రో పిల్లలంచు ప్రార్థిస్తున్నా
హద్దులు మీరి, జనాభా
వృద్ధి స్వదేశాన్ని మ్రింగి వేస్తున్నదిరా!

ఏ పథకం చేపట్టిన
పాపాత్ములు కలిసిదొంగ పనులకు లోనై
దోపిడి చేసేస్తుంటే
ఏ పగిదీ జన్మభూమి వృద్ధికి వచ్చున్!

రౌడీల రాజ్య మిదియని
రౌడీలే చెప్పుతూంటె రక్షణ కోసం
రౌడీల అండజేరగ
దౌడులు తీస్తుంది ప్రభుత ధైర్యం లేకన్

మోసంలేని ప్రదేశం
దేశంలో లేదనియెడి స్థితిని నిరూపిం
చేశాము, అందుకే ఏ
దేశమయిన భయపడు మనదేశం అంటే!